# జనశ్రుతి

## (గేయ కవితలు)


ఎస్. అన్నపూర్ణ



డిపార్ట్‌మెంట్ ఆఫ్ మ్యూజిక్ అండ్ ఫైన్ ఆర్ట్స్



శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయము

తిరుపతి

# జన శ్రుతి

## [గేయ కవితలు]




రచన

**ఎస్. అన్నపూర్ణ** B.A., B.Ed., M.A.(Music)

సంగీత లలిత కళల విభాగం

ప్రచురణ

**శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం**

**తిరుపతి**

**JANASRUTI**
(Geya Kavitalu)

PEOPLE'S VOICE
(Lyric Poems)
by
**S. Annapurna**

University Publication No : 5
First Edition : 1997 (Golden Jubilee)
Copies : 1000

Price : Rs. 20/-

Copies available with :
Registrar
Sri Padmavati Mahila Visva Vidyalayam
TIRUPATI - 517 502

Cover design : Gajula Chandra Sekhar

Printed at
Omega Offset Printers
61, Bazaar Street
TIRUPATI. Ph: 23372

## అంకితం

విద్య నేర్పి
ఉద్యోగమిచ్చి
ఆదరిస్తున్న

**'శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయానికి'**

కృతజ్ఞతలతో
**యస్. అన్నపూర్ణ**

శ్లో॥ జ్ఞానమ్ నిర్మోచనమ్ స్త్రీణామ్!
విద్యా జ్ఞానస్య సాధనమ్!
విశ్వ విద్యాలయః పద్మా
వత్యా ఆదర్శ మస్తునః



# మాటల వరస


| | |
|---|---|
| ఆశీస్సు | ప్రొఫెసర్ పి. గీర్వాణి |
| ఆనందం | డా॥ సి. అంజలీదేవి |
| ఆమోదం | ప్రొఫెసర్ ప్రపంచం సీతారామ్ |
| అనుకంప | డా॥ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ |
| అక్షరాంజలి | డా॥ మేడసాని మోహన్ |
| అంతరంగం | శ్రీమతి యస్.అన్నపూర్ణ |


# పాటల వరస


## 1. విశ్వవిద్యాలయ విరుల కిన్నెరలు

1. విశ్వ విద్యాలయ గీతం
2. విశ్వ విద్య
3. దశదిశలకు
4. క్రీడోత్సవ సంరంభం
5. స్వాగతం

## 2. మహిళాభ్యుదయ మాలికలు

6. అబలవు కాదమ్మా
7. దివ్వెవెలిగింపవే
8. లింగభేదమెందుకు?
9. మేలుకో ఓ మహిళా
10. ప్రగతి పథంలో
11. మహిళ
12. లాలిత్యం - ఆడపిల్ల
13. సంగీతము కాదు ఘనత

## 3. సంగీత సౌరభాలు

14. నాదావిర్భావం
15. తంబురా
16. సంగీతపరిణామం
17. జగమంతానాదమయం
18. సాధనయే
19. తపముసేయవే
20. భారతి దేవి
21. సూరదాసునూరడించి
22. చదువుల దేవత
23. ఆదిత్యాగరాజనుత

## 4. సద్భావనా గానం

24. మతం మతం
25. అల్లదేమ్రోగింది
26. ఏమతమైనా
27. మనిషి మనిషిలో
28. కులమేటికి మతమేటికి
29. మేలుకో
30. నేషనల్ సర్వీస్ స్కీమ్ (N.S.S.)
31. సారా ఉద్యమం
32. ఉపాధ్యాయులం
33. చంద్రునిలా
34. చినికి చినికి గాలివాన
35. సర్వమతపూజ్యబాబా
36. సాయిచెప్పిన దాని

## 5. పర్యావరణ పదాలు

37. ఇంటాబయటా
38. కాలుష్యం
39. ఒక్కచెట్టునాటితే
40. మొక్కలమ్మ మొక్కలు

## 6. ప్రకృతి పులకింతలు

41. పావురాయి
42. వెన్నెల
43. కోయిల
44. మల్లెలు
45. చిలుకనై
46. పొద్దుపొడవంగానె
47. తరికిటతకఝుం
48. తేలియాడినదేమి
49. జామురేతిరి

## 7. ఆరోగ్యగేయాలు

50. మృదులం మధురం (HOME SCIENCE)
51. ఆరోగ్యమే మహాభాగ్యం
52. చందమామచూడు
53. పిల్లల మనసులు
54. ఎబిసిడి విటమిన్లం
55. తినండి - తినండి
56. చిట్టి పాపలు
57. రంగుల వైభవం
58. బొమ్మల కొలువు
59. ఎయిడ్స్

## 8. వృద్ధులపై పాటలు

60. ఆనందోత్సవం
61. ఎగరేయండి!
62 వృద్ధులకు వందనం
63 పెంచిన పెద్దలు

## 9. సందర్భోచిత సృజనలు

64. సులలితం
65 జయమ్ము కల్గు గావుతన్
66. హృదయావేదన
67. వేణుగానరసధురీణుడు
68. కరుణశ్రీ
69. వరములనీయవె (గీర్వాణి)
70. న్యాయదేవత
71. నిత్య 'సత్యవతి'
72. పారిశ్రామిక రంగాన

## 10. "జన్మభూమి" ప్రబోధాలు

73. తరలిరండి, తరలిరండి!
74. జన్మభూమి
75. రండీ, రండీ!
76. శ్రమదానం
77. జన్మభూమికోసం
78. మా దేశం!

## 11. "స్వర్ణోత్సవ" గీతాలు

79. స్వర్ణోత్సవ రథం
80. ఎఱ్ఱకోటపై జెండా
81. ఆనందం తాండవించె

## కృతజ్ఞతాంజలి

82. తారకరామ స్మరణ.

# ఆశీస్సు

ప్రొ॥ పి. గీర్వాణి
వైస్‌ఛాన్సలర్

శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం
తిరుపతి

"జ్ఞానమ్ నిర్మోచనమ్‌స్త్రీణామ్!" జ్ఞానంవల్ల స్త్రీలు స్వేచ్ఛ పొందుతారు. విద్య జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. స్త్రీలను విద్యావంతులుగా తీర్చిదిద్దడానికి శ్రీపద్మావతి మహిళా విశ్వవిద్యాలయం నెలకొల్పబడింది. ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్క శక్తి నిబిడీకృతమై యుంటుంది. అలాంటిశక్తిని గుర్తించి, ప్రోత్సహించి, బహిర్గతం చెయ్యటానికి తోడ్పడునదే సరియైన విద్య.

మా విశ్వవిద్యాలయకళాశాలలో సంగీత విభాగం ఒక ప్రత్యేకమైన శాఖ. ఎందువల్లనంటే సంగీతం ఎల్లరను అలరింపజేస్తుంది. ఈ శాఖలో అన్నపూర్ణ అధ్యాపకురాలు. సందర్భోచితమైన ఆమె పాటలు నన్నెంతో అలరించాయి. ఒకసారి పర్యావరణ సంబంధమైన సభలో 'కాలుష్యం' గురించి పాడగా విన్నాను. అందులో ముఖ్యాంశాలన్నీ వచ్చాయి. ఆమె శ్రద్ధకు, విషయ సేకరణకు ఎంతో ముచ్చట పడ్డాను. ఒక విషయాన్ని గ్రహించి సమగ్రంగా పాట వ్రాయడం ఒక విశేషమైన ప్రక్రియ. పైగా తానే భణితికూర్చి పాడటం ఇంకా విశేషమనే చెప్పాలి. ఆమె గానం శ్రావ్యంగా ఆకట్టుకునే రీతిలో వుండటం 'పసిడికి తావి అబ్బినట్లు' అనే చెప్పాలి.

శ్రీ పద్మావతి మహిళా యూనివర్సిటి తరపున 'జన్మభూమి' కార్యక్రమంలో పాల్గొని అన్నపూర్ణ చక్కని గేయాలు వ్రాసి ఆలపించారు. తన సేవాభావాన్ని సంగీతంద్వారా బహిర్గతం చేసుకోవటం మాకందరికీ చాల సంతోషమయింది. స్వర్గీయ తారక రామారావుగారి సంస్మరణ సభలో ఆమె భక్తిగానం చేసినపుడు ఆర్ద్రతతో అందరి నేత్రాలూ చెమర్చాయి.

అన్నపూర్ణవ్రాసిన భావోపేతమైన పాటలు అందరికీ ఆహ్లాదకరంగావున్నాయని భావించాము. ఈ భావాలు ముద్రణ రూపం దాల్చినప్పుడే ఎంతో మందికి తెలియజేయడానికి వీలవుతుంది. అందుచే ఈ పాటల ప్రచురణ విశ్వవిద్యాలయంచేపట్టింది. ఇది మొదటి ప్రచురణ. దీన్ని సహృదయంతో ప్రోత్సహించగలరని విన్నవిస్తున్నాను. సంగీత విభాగం నుండి యింకా కొన్ని ప్రచురణలు రావాలని ఆశిస్తున్నాను.

చి॥ అన్నపూర్ణ తన సృజన కళా కౌశలాన్ని పెంచుకొని, మధుర గాన నైపుణ్యాన్ని యినుమడింపజేసికొని గాయనిగా - కవయిత్రిగా రాణించాలని ఆశీర్వదిస్తూ -

పి. గీర్వాణి

# ఆనందం

డా॥ సి. అంజలీదేవి
రిజిస్ట్రార్

శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం
తిరుపతి.

మా విశ్వవిద్యాలయ కళాశాల ప్రత్యేక కార్యక్రమాలలోగాని, సమావేశాలలోగాని పాల్గొన్నప్పుడు శ్రీమతి అన్నపూర్ణ పాట వినడం జరుగుతోంది. ఏ కార్యక్రమానికైనా ఆమె ఒక సొంతపాటతో తయారయి వస్తారు. పాట ఎంతో కమ్మగాను, ఆత్మీయత నిండినదిగాను వుంటుంది.

భగవద్గీతా తరగతులు నిర్వహించినపుడు ఆమె కనబరచిన శ్రద్ధా భక్తులు సముచితమైనవి. పాటలవలెనే శ్లోకాలు కూడ సంగీతపరంగా హృదయరంజకంగా వినిపించారు. సంగీత అధ్యాపకురాలిగా ఆమె కేవలం బోధనతో పరిమితం కాకుండా విశ్వ విద్యాలయానికి వివిధ సందర్భాలలో పదకవితా గానంతో సేవలందిస్తున్నందుకు ఆనందిస్తున్నాను.

ఈ "జనశ్రుతి" జనబాహుళ్యంలో చైతన్యం తీసుకొని రావాలని అభిలషిస్తున్నాను. ఎందుచేతనంటే ప్రజల నాడిని బట్టీ, నేటి అవసరాన్నిబట్టీ, ఈ పాటలున్నాయి. స్త్రీ జనాభ్యుదయం స్త్రీ వాదమే గాక, ఈనాటి ప్రజాస్వామ్య అవశ్యకతకూడ. దేశ సమగ్రత నిమిత్తం, ప్రజాసౌఖ్యం కోసం 'సద్భావన' ఎంతో అవసరమైంది. అలాగే మానవుడెదుర్కొంటున్న 'పర్యావరణ' సమస్యలు, అనారోగ్యపుటిబ్బందులు తీర్చుకోవడానికి పల్లె-పట్టణాల్లో ప్రబోధం జరగాలి. ఇక 'జన్మభూమి' మనకళ్ళముందు పుట్టిన రాష్ట్ర పథకం; అపురూపమైంది. ఇది బలం పుంజుకోవలసిన తరుణంలో ప్రజల్లో ఉరకలెత్తేటటువంటి ప్రేరణ సృష్టించాలి. అందుకు తగిన వాడి, వేడి ఈ పాటలలో ఉన్నాయి. ఇదొక జనవేదం లాంటిది. జనుల భావాలే జనుల చెవుల్లో పడాలి. విద్యార్థుల యొక్క, కార్యకర్తల యొక్క గళాలలో పులకించాలి. రానున్న స్వర్ణోత్సవ సంబరాలలో ఈ గేయాలు శ్రుతిలయలు కావాలి. ఇది మా అభీష్టం.

**సి. అంజలీదేవి**

# ఆమోదం

డా॥ ప్రపంచం సీతారామ్
టి.టి.డి ఆస్థాన విద్వాన్. కలైమామని
కంచికామకోటి పీఠ ఆస్థాన విద్వాన్
వేణుగాన సామ్రాట్, నాదక్కనల్.

శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం
సంగీత, లలిత కళల విభాగం
తిరుపతి
ఆచార్య - అధిపతి

చి॥ సౌ॥ అన్నపూర్ణ గారు సుప్రసిద్ధ సంగీత కుటుంబం నుంచి వచ్చారు. తండ్రిగారైన **శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం** గారు మహావిద్వాంసులు, గాంధేయవాది, సమాజసేవకులు. వారూ మా నాన్నగారు శ్రీప్రపంచం కృష్ణమూర్తిగారూ, కీ॥ శే॥ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి వద్ద సంగీత విద్యాభ్యాసంచేశారు. ఆ కారణంచేత వారి కుటుంబ సభ్యులు సైతం నాకు చాలా సన్నిహితులు. ఈ సందర్భంలో చి॥ సౌ॥ అన్నపూర్ణను ఆశీర్వదిస్తూ శ్రీ రఘుపతిరావుగారిని అభినందిస్తున్నాను. వారుకూడా వారి సతీమణికి ఇస్తోన్న ప్రోత్సాహం అత్యంత శ్లాఘనీయమైనది.

శ్రీమతి అన్నపూర్ణగారు మా సంగీత విభాగంలో అధ్యాపకురాలిగా పనిచేయటం గౌరవప్రదం. మితమైన సంభాషణలతో. సంబంధిత బాధ్యతలతో, సహజమైన ఆత్మీయతా భావంతో ఆమె ఎప్పుడూ తన పనితాను చూసుకుంటూవుంటారు. ఆమె నెమ్మదిగా, నిరాడంబరంగా డిపార్టుమెంటులో కనిపిస్తారు; వినయశీలి. ఆమె మాటలాడటం తక్కువ. పాటలు రాయడం ఎక్కువ; పాడివినిపించడంలో మక్కువ. ఆమె రచించిన కొన్ని కృతులలో సంగీత ఆవిర్భావము, సంగీత చరిత్ర, సంగీతలక్షణకారులు, వాగ్గేయకారులు మున్నగు అంశములు క్లుప్తముగా తెలియజేశారు. తద్వారా ఈ అంశాలపై విద్యార్థులకు సరళమైన భాషలో అవగాహన కల్పించారు. ఈ కృతులను ఆమెయే పాడుతున్నప్పుడు మధురంగాను. భావగర్భితంగాను ఉండి ఆనందాన్ని చేకూరుస్తున్నాయి.

కళాశాలలో ఏ సందర్భం వచ్చినా ఆమె పాటతోపాటు హాజరవుతుంటారు. ముందుగా నాకు వినిపించడం, నా ఆమోదం పొందడం ఆమెకు ఆనవాయితి. తనగురించి ఎప్పుడూ ఆమె బాహాటంగా ప్రచారంచేసుకోరు. కాని ఆమె కలంలో ఎంతసృజనత్వముందో ఆమె గళంలో అంత గాంభీర్యం వుంది. కళ అనేది అంతర్గతమైంది. అది పాట, పద్యం, నాట్యం, శిల్పం ఏదో ఒకరూపంలో బహిర్గతం కావాలి. అప్పుడే సమాజానికి ప్రయోజనకర మౌతుంది. అన్నపూర్ణగారి ఆశుకవితలూ, గీతాలూ ముద్రించటానికి శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం ప్రోత్సాహమివ్వడం ఎంతైనా సముచితం. అది మా సంగీత విభాగానికి గర్వకారణం. ఈ విషయంలో చొరవ తీసుకున్న వైస్ ఛాన్సలర్ మేడమ్ ప్రొ॥పి. గీర్వాణి గారికి అధికారులకు, డిపార్టుమెంటు తరపున ధన్యవాదాలు.

అలాగే అన్నపూర్ణగారికి గౌరవాదరణపూర్వక అభినందనలు. ఆమె సంగీత రంగంలోనూ, సామాజిక క్షేత్రంలోనూ స్ఫూర్తిదాయకమైన రచనలు చేస్తూ, దైవానుగ్రహం పొందాలని కోరుకొంటున్నాను.

గేయకవితల "జనశ్రుతి" చదువరులకు చైతన్యం కల్గించుగాక. ఆనందము ఇచ్చు గాక!

తిరుపతి : 1-7-1977

ప్రపంచం సీతారామ్

# అనుకంప

పద్మవిభూషణ్, సంగీత కళానిధి,
సంగీత సుధాకర

కనకశ్రీ నగర్,చెన్నై
6-7-97

**డా॥ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ**

చి॥ సౌ॥ అన్నపూర్ణ తన చిన్నప్పటి నుంచీ నాకు సన్నిహితంగా తెలుసు. పదేళ్ల వయసులో పాడుతూ వుంటే గమనించాను. దగ్గరకు పిలిచి తన పాట రికార్డు చేశాను. తిరిగి వినిపించేసరికి ఆశ్చర్యం ఆనందం పొందింది. సుప్రసిద్ధ కుటుంబంలో జన్మించింది. కీ॥శే॥ శ్రీ రాజశేఖరం గారి కుమార్తె. ఆయన గొప్ప సంగీత విద్వాంసుడు, లక్షణ కారుడు, సమకాలీన వాగ్గేయకారుడు. తండ్రివద్ద ఆమె సంగీతం నేర్చుకొన్నది. ప్రోత్సాహానికి అర్హురాలు.

'జనశ్రుతి' పాటల పుస్తకం అచ్చవుతుండగా తెచ్చి చూపించింది. నాకు ముచ్చటేసింది. "ఎన్ని పాటలు వ్రాశావు!" అని సంతోషపడ్డాను. శ్రుతి అంటే వేదం, నాదం, వినికి. జనశ్రుతి అంటే జననాదం, జనుల పాటలు, జనులకొరకు పాటలు. ఇవి ఈతరం పాటలు. పాటలకు తగిన చక్కని నామకరణం. అన్నపూర్ణ అభినందనీయురాలు.

సంగీతానికి సౌరభం అబ్బడం కళాకారునిపై ఆధారపడి వుంటుంది. నాదావిర్భావం, సంగీతపరిణామం, స్వరావళి మున్నగు విషయాలపై వ్రాసిన కృతులు విషయసూచకంగా వున్నాయి. వినసొంపుగా కూడా వున్నాయి. విద్య నుంచి పర్యావరణం వరకూ, సంగీతం నుంచి జన్మభూమి వరకూ వ్రాసిన పాటలు ఆసక్తికరంగా వున్నాయి. మహిళాభ్యుదయం గూర్చి మహిళలు వ్రాయడం సముచితంగా వుంది. ఎవరికి వారు వృద్ధి చెందే ప్రక్రియ ముదావహమైంది. ఈనాడు సంఘానికి కావలసిన అన్నిరకాల పాటలు ఈపుస్తకంలో వుండడం విశేషం. సామాజిక చైతన్యం నిమిత్తమూ, మానసిక-భౌతిక ఆనంద ఆరోగ్యాల కొరకూ కవితలు, గానము వినియోగపడడం ఆధునిక కాలంలో అత్యావశ్యకం. ఈ ప్రయత్నంలో అన్నపూర్ణ సఫలీకృతం కావాలని ఆశిస్తున్నాను. జాతీయ భావకవి అయిన తండ్రిగారి అడుగుజాడల్లో నడుస్తూ, తరతరానికి సత్సంబంధం నెలకొల్పగలదు.

సాహిత్యం పాటకు బలం. గానం పాటకు ప్రాణం. పాడినప్పుడే పాటకు సార్థకత. కనీసం సంగీతవిద్యార్థులు, అభిమానులైనా ఇందులో కొన్ని పాటలు ఎన్నుకొని పాడుతూవుంటే రచయిత్రికి ప్రోత్సాహకరంగావుంటుంది. 'జన్మభూమి' పాటలు ప్రభుత్వం వారికికూడ ఉపయోగపడతాయి.

ఈ పుస్తకం ప్రచురిస్తున్నందుకు శ్రీపద్మావతి మహిళా విశ్వ విద్యాలయం వారినీ వారి సంగీతవిభాగాన్నీ అభినందిస్తున్నాను. సౌభాగ్యదాయిని అన్నపూర్ణను అనుకంపతో ఆశీర్వదిస్తున్నాను.

# అక్షరాంజలి

కవితాగంగోత్రి, సరస్వతీ సత్పుత్ర,

సహస్రావధాని

**డా॥ మేడసాని మోహన్**

యస్. అన్నపూర్ణగారు రచించిన "జనశ్రుతి" ఒక అక్షరసుకృతి. ఈ రచన సాహిత్యాంశ నాకు రసానందం కలిగించింది. సందేశం, సారస్యం, సౌహార్ద్రం మేళవించిన ఈ రచన అన్నపూర్ణ కవితాభావుకతాస్ఫూర్తికి నిదర్శనం. సత్యాన్వేషకులకు సహృదయానంద సందర్శనం.

"పరిప్రశ్నతో పరమార్థము తెలిసికో
తెలిసిన దానిని బ్రతుకులో మలచుకో"

"ఒకేకులం ............ లోకులం.......... శ్రామికులం .......... సేవకులం ......." వంటి గేయాలు సార్వకాలిక సార్వజనీన సత్యస్ఫూర్తిని ఆవిష్కరిస్తున్నాయి. లౌకిక, అలౌకికమైన ఎన్నో అంశాలు ఈమె కవితకు ఇతివృత్తాలైనాయి. ఏ అంశాన్నైనా ప్రస్ఫుటమైన భావనావైశద్యంతో, సముచిత శబ్దజాలంతో దీపింపజేయగల నైపుణ్యం ఈ రచయిత్రికి ఉంది. ఈమె సాహిత్యానికి సంగీతం కూడా తోడు కావడం బంగారానికి పరిమళం అబ్బినట్లైంది.

'జనశ్రుతి' అన్న పేరు కూడా ఈ సంపుటికి సముచితంగా ఉంది. అన్నపూర్ణగారు రచనావ్యాసంగంలో కూడా ఒక అన్నపూర్ణాదేవిగా భాసింపగలరని ఆకాంక్షిస్తున్నాను.

తిరుపతి
11-7-1997

డైరెక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు

# అంతరంగం

ప్రతి పాటకూ స్పందించేదాన్ని చిన్నప్పుడు. మానాన్న గారు **శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం** గారు గొప్ప వాగ్గేయకారులు, సంగీత భూషణులు, లక్షణా చార్యులు,జాతీయ భావకవి. వారు పెట్టిన భిక్షయే నా గీతాలకు సంగీతానికి భూమిక అయింది. మా అమ్మ రోజూ పూజలోపాడుకొన్న పాటలే నాగుండెకూ, గొంతుకూ ఊపిరి అయ్యాయి.

మా విశ్వవిద్యాలయ సంగీత విద్యార్థినులకు పరీక్షలో ఒకసారి ఒక తప్పనిసరి ప్రశ్న వచ్చింది. అది నాదోత్పత్తి,దాని పరిణామంగురించి. ఆ విషయాన్ని నేను చిన్న కీర్తనా రూపంలో వ్రాసి వాళ్లకు వినిపించాను (వరాళిలో). అలాగే అభ్యాస గాన క్రమంలో వచ్చే స్వరావళి, ద్విత్వస్వరం, గీతం, అలంకారం, వర్ణం, కీర్తన, కృతి సాధన బలంతో నాదబ్రహ్మను సాక్షాత్కరింపజేస్తాయని వ్రాసికొన్నాను (శంకరాభరణం - సాధనయే). బాల్యంలో నాన్నగారు నాకు బహుమతిగా యిచ్చిన సూరదాసు చిన్నికృష్ణుల పటం చూసుకుంటూ (చూపులుండి చూడలేని) కృతి పాడుకున్నాను. ఆనాటి వైదిక గానం నుండి నేటి సాంబమూర్తి గారి పరిశోధనల వరకూ అన్నీ సంగీత చరిత్రలో మలుపులే. వాటిని 'వైదిక యుగమున' అనే ఆభోగి కృతిలో పొందుపరచాను. గృహభారం, సాంసారిక జీవితపు ఒడిదుడుకులనూ తట్టుకోవడానికి (తపముసేయవే - రంజని ద్వారా) దైవ చింతన చేసికున్నాను. ప్రకృతితో పాటలుపాడుకొని తన్మయం చెందాను. సంగీతకృతులను స్వరపరచడం కూడ జరిగింది.

మొదట విశ్వవిద్యాలయానికి ఒక మకుట గీతం వ్రాశాను. పర్యావరణ పరిరక్షణకు కొన్ని పాటలు వ్రాశాను. స్త్రీ అబలకాదు సబల అనిపాడుకున్నాము. సమయోచితంగా వ్యక్తులను గూర్చి, సందర్భాలను గూర్చి వ్రాసి విదార్థినులతో పాడిస్తూ వున్నాను. ఇల్లంతా సంగీతంగా 'మానసోల్లాసం' పొందాను. ఏదో పాట సొంతంగా వ్రాసుకొని పాడటం - ఆపాటకు భణితి కట్టుకోవటం - యివ్వన్నీ ఎప్పుడూ మామూలుగా వుండే జీవిత స్థితిగతులకు కొంత విశ్రాంతి నిచ్చి మనస్సును తేట పరుస్తాయి.

ఇంతకు ముందు వున్న వి.సి. మేడమ్ ప్రొఫెసరు పి.ఆర్.రెడ్డి గారు నన్నొక సారి గమనించి 'ఎప్పుడూ చెట్టు క్రింద ఏదోరాస్తూంటావు, ఏమి రాస్తావు' అని ప్రశ్నించారు. హఠాత్తుగా అధికారిణి అలా అడిగేసరికి నాకు భయం వేసింది. అయినా దగ్గరకువెళ్లి నా కవితలుకొన్ని వినిపించాను. ఎంతో సంబరపడ్డారు. అప్పటి నుంచి అమె నన్ను ఒళ్లోకి తీసుకున్నంతగా ప్రోత్సహించారు. ఒక సందర్భంలో ప్రిన్సిపాల్,ప్రొఫెసర్ ఎ. సత్యవతి గారికి కొన్ని పాటలు పాడి వినిపించడం జరిగింది. అమెనన్ను దగ్గిరిగాతీసుకొని ఆప్యాయంగా

"ఇలా వ్రాస్తూండాలమ్మా" అని అనడంనాకు ఎప్పుడూ తీయని జ్ఞాపకం. ఇక మా సంగీత విభాగం అధినేత, ప్రొఫెసర్ డా॥ ప్రపంచం సీతారామ్ గారు సందర్భం వచ్చినపుడల్లా నాచేత పాట వ్రాయించడానికి అనుమతించి ప్రోత్సహిస్తుంటారు .

ప్రస్తుత వి.సి.మేడమ్ ప్రొఫెసర్ పి. గీర్వాణి గారు నా పాటలు పరిశీలించి "యివి పుస్తక రూపంలో ఉండాలి, కొన్ని టి.వి. రేడియోల ద్వారా ప్రచారంలోకి తీసుకొని రావాలి, అంతేగాని మరుగున పడగూడదు. పుస్తకరూపంలో ప్రకటిస్తాము" అన్నపుడు నాకన్నులనిండా ఆనంద బాష్పాలు! ఎంతో కృతజ్ఞురాలిని.

ఇక మావారిని నేను ప్రస్తావించకుండా వుండలేను. వారుక్షణం తీరిక లేకుండా వుంటూ గూడ, ఇది వినండి అదివినండి అని నేను వెంటబడుతూ వుంటే విని మంచి సలహా యిస్తూవుంటారు.ఆయనకు ఋణపడివుంటాను.

ప్రతి సందర్భంలోను "అన్నపూర్ణగారూ! మీరు యీపాటికి పాటరాసే వుంటారు లెండి" అని నవ్వుతూ, ప్రేమగా ఆప్యాయంగా పలకరించే తోటి సహోద్యోగినులకు ఆచార్యపదవిలో ఉన్న పెద్దలకు నాకృతజ్ఞతాంజలి సమర్పించుకుంటున్నాను.

ఈ 'జనశ్రుతి'ని ప్రకటించి వెలుగులోకి తెచ్చిన శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు డా॥ సి. అంజలీదేవి గారికీ, సహకరించిన ఇతర అధికార, అనధికారులందరికీ, వాత్సల్యంతో ఆశీర్వదించిన బాబాయి గారు డా॥ బాలమురళీకృష్ణ గారికీ, 'అక్షరాంజలి' అనుగ్రహించిన డా॥ మేడసాని మోహన్‌గారికీ నా సహృదయానంద కృతజ్ఞాతామందారాలర్పిస్తున్నాను.

మీ

అన్నపూర్ణ

# విశ్వవిద్యాలయ విరుల కిన్నెరలు

## 1. విశ్వ విద్యాలయ గీతం !

వికసించేకుసుమంలా
విలసిత వనితాలయం !
ఇదే! ఇదే! పద్మావతి
మహిళా హృదయాలయం
విశ్వ విద్యకాలయం !

చ॥ తొలిదండము తల్లికి
తొలిదండన తల్లిది
తొలుదొలుద సకల కళా
కలిత శక్తి స్త్రీ మూర్తి
విదళిత జవసత్వాలను
వదలిన స్వాతంత్ర్యాలను
ముదమూరగ తిరిగి పొంద
ముందుకు నడిపే శక్తి ॥ఇదే ॥

చ॥ విజ్ఞానం వనితా జన
విమోచన సాధనం
వనితా జీవన వికాస
వివేచనల శోధనం
స్వేచ్ఛ వాయువులిచట
సమతర భావన లిచట
సౌశీల్యం సౌహార్ద్రం
సుగంధాల సౌరులిచట ॥ఇదే॥

చ॥ "జ్ఞానమ్ నిర్మోచనం
స్త్రీణామ"ని ప్రవచించే
ద్వితీయమౌ అద్వితీయ
స్త్రీ విద్యా విశ్వసదన్
లలిత హసితవదనదీప్తి
మిళిత ప్రేమ మధురకీర్తి
స్నేహ భావ నిత్యప్రాప్తి
కిదే ఇదే నీరాజనము ॥ఇదే॥

# 2. విశ్వ విద్య

విశ్వ విద్య అంటే
విశ్వ నేత్రమే గాదా!
పక్వత సాధించేందుకు
పదిలమైన బాట గదా !
ఎన్ని విధానాలున్నా
ఎన్నివిభాగాలున్నా
ఎన్ని నినాదాలున్నా
స్పందించే నినదించే స్వరమాధురి ఒకటే గద
సప్త స్వర సంగీతం సమ్మోహన సోపానం
అదినాదమె మరిమోదమె
అది మనసుకు సుమభావమే
అందర మొకటే నన్నది ఆమోదముకాగా
సుందరమౌ యీహర్మ్యము
సుదతులదే గాదా !
చదువుల మేడకు పునాది
పదవుల నీడకు సరిపడు
సదనము యీ సమసఖ్యపు
పథమేగద, విశ్వ విద్య
జయ జయ నిస్వనములతో
విజయ దుంధుభిలుమ్రోగ
అజయులు ఆచార్యులుమము
నిజముగ తీరిచి దిద్దగ ॥విశ్వ॥

## [illegible]

దశ దిశలకు వెదజల్లిన
ధవళ కాంతి పుంజమై
దశ వర్షముల పండిన
'పద్మావతి' విశ్వజనని
పసిడి కాంతి సౌరభ సమ్మేళనమే ప్రభవించగ
వశమే వర్ణింప నెవరి తరమే వేనోళ్లపొగడ
శ్రీ పద్మావతి మహిళా (విశ్వ)
విద్యాలయమా !
నీ విద్యా సంపద మా
దేవాలయమమ్మా !

1. మరకత "మాణిక్యవీణ"
మ్రోయించును ఒక "మగువ"
వరమగు "విద్య"ను గురుతరముగ నేర్చును ఒక "వనిత"
కరమున దానల్లును "బంగరుచేలము" ఒక "కలికి"
ఒరవడిగా "గృహశాస్త్రపు" సరళి తెలియునొక "వెలత"

శ్రీ పద్మావతి మహిళా (విశ్వ)
విద్యాలయమా !
నీ విద్యా సంపదమా
దేవాలయమమ్మా!

2. "గణిత శాస్త్ర" ప్రావీణ్యత గడియించును ఒక "ముదిత"
అగణిత "సాంకేతిక" రంగాన మెరయునొక "అతివ"
అన్యాయము వెదిరించి హక్కులకై కృషి సలిపి
"న్యాయదేవత"ను ఆహ్వానించును ఒక "ప్రమద"
శ్రీ పద్మావతి మహిళా (విశ్వ)
విద్యాలయమా !
నీవిద్యాసంపద మా
దేవాలయమమ్మా !

3. ఆప్యాయత అనురాగము ఆదరముల జూపించి
"సంఘసేవ" ఊపిరిగా సేవించును ఒక "సబల"
అలరించును ఆటలలో తేలించును ఒక "పడతి"
అనయము "స్త్రీ అభ్యుదయము" నందించును ఒక "లలన"
చిలకరించునే తేనియ తేట "తెనుగు" నొక "పొలతి"
శ్రీ పద్మావతి మహిళా (విశ్వ)
విద్యాలయమా
నీవిద్యాసంపద మా
దేవాలయమమ్మా !

4. నలుదెసలను "ప్రసరింపగ" జేయును తనదైనఘనత
పలువిధముల ప్రగతినంత "చాటించును" ఒక "యింతి"
సూక్ష్మాతి సూక్ష్మ జీవరాసుల ఘన ఉనికినంత
వీక్షించును ఒక "ఉవిద" వింతగ "దర్పణ"మందున
అంతర్జాతీయమైన ఆంగ్లభాషను
మంగళకరమొనరించును ముదమారగ ఒక "చెలువ"
శ్రీ పద్మావతి మహిళా (విశ్వ)
విద్యాలయమా !
నీ విద్యా సంపదమా
దేవాలయమమ్మా !

5. వైద్య రంగమునకే యాద్యంతమైన "ఔషధముల"
విద్యలు విదితము జేయును వివరముగను ఒక "మహిళ"
"గ్రంధాలయ సర్వస్వము" ఆంధ్రేతర భాషలలో
అందించును అనవరతము స్పందించును ఒక "అంగన"
ఆనందపు టంబోనిధి అవధులు దాటినదే !
అందెను అంబరమే చిందెను సంబరమే !
"పరిపాలన భవనమంత"
ప్రతిభా పాటవములతో
పురుషులతో సరిసాటిగ
నడిపించగ "రిజిస్ట్రారు"

నైపుణ్యముతో దీటుగ
స్పందించును ప్రాంగణము
పచ్చగ పది కాలమ్ములు

శ్రీ పద్మావతి మహిళా (విశ్వ)
విద్యాలయమా !
నీ విద్యా సంపదమా
దేవాలయమమ్మా !

6. అందరునీ బిడ్డలమ్మ
ఆదరముగ అందుకొమ్మ
ఇందరి విద్యలకధిపతి
విద్యాలయ "కులపతి"కి
విజయము చే కూర్చవమ్మ
విరివిగ విజ్ఞానమిమ్మ !

తరలి రండు రండిదే
తరుణు లందరూ గూడి
తరణో పాయమువిద్యయె
తరలిపోవు తమస్సంత !

శ్రీ పద్మావతి మహిళా (విశ్వ)
విద్యాలయమా !
నీ విద్యా సంపదమా
దేవాలయమమ్మా !

# 4. క్రీడోత్సవ సంరంభం (బాల్‌బాట్మెంటెన్)

క్రీడోత్సవ సంరంభం ! ఇది
క్రీడా కారిణి సంధానం
తేడాలన్ని త్రెంచివైచిమరి
వేడుకతో వినోదము పొందే
విశ్వ మేగదా.!
"ముప్పది యొగటిగ" ముచ్చట గూడిన
విశ్వమే గదా !

1. ఆది భారతమె ఆలంబనగా
అర్జునినే మన కిచ్చెను "క్రీడిగ"
అటునిటు తూణీరము నవలీలగ
అనుసంధించెను సవ్యసాచిగా ||క్రీడో||

2. విలు విద్యలో మరి మల్లవిద్యలో
గదా యుద్ధములో గుండెలు పండిన
వీరులెందరో భారతీయులే
పలుక్రీడల కలకల శంఖారవముల
పూరించెను మన భారతమే ! ||క్రీడో||

3. లేడికి లేచిందే పరుగను
లేమ "ఉష" మన పరుగులరాణి,
మన "అశ్వని" శరవేగంగా
నిఖిల విశ్వములో నిలిచినట్టి
ఇంతులుగా పూబంతులా
చేమంతులా సమకాంతులా
వింత విక్రమ వినోద క్రీడల
ఎంతో ఎదిగిరి వీరనారులు ! ||క్రీడో||

4. బాలు బాడ్ మెంటన్ ప్రథమ
క్రీడగ ఆపాదించిరి మనకు
వాలీబాల్ మరి త్రోబాల్ కలయిక
గెలుచు కొందమూ ఘనవైభవమున

ప్రముఖులెందరో ప్రసిద్ధి పొందిరి
ప్రభవించిరి మన భారతావనిలో
క్రీడాకారుల వలయం - ఇది
శూరులధీరులనిలయం ! ॥క్రీడో॥

5. దృఢ దారిధ్యపు కాంతి నొసగును
ధృవ పరచును మన మనో వికాసం
[illegible]పొందించును సౌభ్రాతృత్వం
ఆటల పాటల ఆన[illegible]గం మన
బాటకు వే[illegible]వము ॥క్రీడో॥

6. మహ[illegible]ముదావహం మీ
రాకయె మాకానందం
మహిళా విద్యాలయ ప్రాంగణమున
సదాభినందన తోరణమే
మహా విశ్వ విద్యాలయ మండలి
మహా మహుల కిదె స్వాగతము

# 5. స్వాగతం (వాలీబాల్)

స్వాగతం ! స్వాగతం ! స్వాగతం !
తరలిరండి రయమున
"వాలీబాల్" క్రీడకిదె
మహిళ విశ్వవిద్యనిలయ
ప్రాంగణమ్ము ఆడెను
పచ్చనైన ప్రకృతంత
పరవశించి పాడెను ॥

1. మొదటగ అమెరిక వాసులు
ఆడిరి అతి ప్రాభవమున
తడుపరి యూరోపియనులు
ప్రాముఖ్యత నిచ్చిరి
ప్రాకింది ప్రపంచమంత
ప్రాక్ పశ్చిమములలో

భారతీయ ప్రాభవమును
కైవసమ్ము చేసికొనెను ॥

2. విన్నారా ! కన్నారా
ఈ వింతల విశ్వకాంతి
విలియం మోర్గాన్ మరియు
జిమ్మీ జార్జీలు
మింటా నంటిల్ మరియు
వై.ఎమ్.సి.ఎ. హాల్ స్టెడ్
స్ఫూర్తి నిచ్చిరీ క్రీడకు
వెలుగు నిచ్చిరి ॥

3. కుట్టు కృష్ణ గుజరాత్ వాసిగ పేరుగాంచినాడు
శాలీ జోసఫ్ కేరళ పొందెను "అర్జున" ఎవార్డు
తెలుగు వెలుగు శ్యామ సుందరే గెలిచెను "అర్జున"
శిక్షకుడుగ పేరుగాంచిన రమణారావిల
పొందెను 'ద్రోణాచార్య' మేటి పదవిమేలుగా

4. మన భారతదేశంలో ఎందరెందరో వనితలు !
ఎగురవేసిరి కీర్తిని - అంబరాన పతాకగా
బాటలో మరి పాటలో - సముఉజ్జీలై రండి
విద్యకు వినయము తోడుగ
క్రీడల సరిసాటిగా

పిలిచెను పద్మావతి ఏ
బది రెండు విశ్వములను
గెలిపించుటకై తనవడి
చేర్చుటకై విశ్వజనని

స్వాగతమ్ము మీకిపుడు పలుకును సంరంభంతో
మహిళలు విశ్వపు విద్యల ప్రతిభలు తోడైజగతిని

# మహిళాభ్యుదయ మాలికలు

## 6. అబలవు కాదమ్మా !

అబలవు కాదమ్మా !
సబల వేనమ్మా !
అబలల సబలల
సమాదరించే
అమ్మవు నీవమ్మా ! తగిన
కొమ్మవు నీవమ్మా !

1. ఆది వాఙ్మయపు వేదకాలమున
అధికారము నీసొమ్మమ్మా !
పాదునీది పరిపాలన నీది
మాతృ స్వామ్యపు విధినీదమ్మా ॥ అబల ॥

2. క్షేత్రము నీవు క్షాత్రము పురుషుడు
చరిత్ర కాధారము స్త్రీ పురుషులు
పరిపూర్ణతకై ఇరువురు చేరగ
పురుషాధిక్యత అర్థ రహితమమ్మా ॥ అబల ॥

3. అడుగడుగున ఆడమగ తేడా
కడగండ్ల నడుమ కలికివి నీవు
గడిచి పోయినవి నడచి రావుమరి
కడుదిట్టముగ ముందుకు నడువు (ము) ॥ అబల ॥

4. అగ్నిగుండమున రగిలేజ్వాలవు
స్నిగ్ధ హృదయ దరహాసవు నీవు
దిగ్దిగంతములు దద్దరిల్లగను
దగ్ధము చేయుము దుర్దినమ్ములను ॥ అబల ॥

5. సజీవ దహనం - సతీధర్మమా ?
పెళ్లికి ప్రేమకు వరకట్నాలా ?
బ్రతుకు బరువుగా గడుపగనేల ?
పురుషాధిక్యత ఘాత ఖండించు ॥ అబల ॥

6. అగ్ని కణంలా - రగిలే జ్వాలగ
విద్యుత్ కాంతిగ - విప్లవరాణిగ
ఆవహించుము యీ అవనంతా !
అబలవు కానే కాదమ్మా నీ
ఆత్మశక్తి నీ ఆయుధమమ్మా ! ॥ అబల ॥

# 7. దివ్వె వెలిగింపవే !

దివ్వె వెలిగింపవే !
మువ్వ పలికింపవే !
నవ్వు చిలికించవే !
దవ్వులను వేణువుల
సవ్వడులు గ్రోలవే ! ॥దివ్వె ॥

చ॥ మమతలొలికే మదర్ "తెరిస్సా నీవే !
సమత చిలికే సంఘ సేవికవునీవే !
సాహసోపేతంగ వినువీధి కెగసిన
వ్యోమ గామివి నీవు " తెరిష్కోవా" నీవు ॥ దివ్వె ॥

చ॥ కదన రంగాన ఝాన్సిలక్ష్మివినీవు
హృదయాంత రంగాన ప్రేమ వర్తివినీవు
ముదమార నీ విద్య సార్థకము చేసికో
పదిలంగ బ్రతుకంతజ్యోతిగా మలచుకో ॥ దివ్వె ॥

# 8. లింగ భేద మెందుకు ?

లింగ భేద మెందుకు ?
సాంఘిక భావైక్యముంటె
లింగ భేదమెందుకు ?

వ॥ బలహీనత దోచుకునే
భావాలను కట్టి పెట్టు

1. ఆడమనిషి - అబల - అర్ధాంగియని పిలవొద్దు
జనాభాలో సగమైన - జీవితాన సగం కాదు

ఎవరి జీవితం వారిది
ఎవరి వికాసం వారిది
పరస్పరం స్నేహితులం
పనిపాటల సహచరులం

2. ఆకాశంలో సగం
అధికారంలో సగం
అహం భావమున సగం
అడుగడుగున చెరిసగం
సగం సగం మాకొద్దు - అర్ధాకలి అసలొద్దు
మాకై మము బ్రతుకనిండు
మీ ఆజ్ఞలు మాకొద్దు

3. మహిళంటే మంచితనం !
మహిళంటే హిమసమం
మహిళంటే లాలిత్యం
మంచిగ చల్లగ మెలగవె
మహిళా ! ఓ మహిళా !
మహిళా - ఓ మహిళా !

# 9. మేలుకో ! ఓ మహిళా !

మేలుకో ఓ మహిళా మేలుకో !
పాలనలో సగమై మరి
లాలనలో శతమై నువు మేలుకో !

1. ఆకాశంలో నీవు అర్థ భాగమన్నారు
అందుకే అందక నీవు ఆవిరియై పోయావు
పతితో చితిమీద బడి బూడిదవై పోయావు
క్షితిలో నీ ఉనికెంతో క్షీణమై పోతోంది ॥ మేలుకో ॥

2. వరకట్నపు వికృతం
వంటింటికి అంకితం
వాడికోర చూపుల్లో
వేడి సెగల కాహుతై తే
పృధ్వీ మాతవు నీవని
పొగిడి పొగిడి పైకెత్తిరి
బాధలు అగ్ని జ్వాలల
కీలల చల్లార్చునే ! ॥ మేలుకో॥

3. ఆర్థిక హక్కులు లేక అణగి వెతలకులోనై
అబలాకృతి దుర్బలవై అజ్ఞానం రూపుదాల్చి
హాహాకారాల్జేస్తూ - ఎన్నాళ్ళిక సహిస్తావు ?
మహాసంద్రమున్ మథించు
మహిషాసురు పరిమార్చు
ఆది శక్తివై మరి నువు
స్త్రీ శక్తిగ ప్రవహించి
యశస్వినిగ వర్థిల్లవె
నవయుగాల కాంతికాగ
హింసాయుత దౌర్జన్యపు
చర్యల బలియై పోవక
ఓ మహిళా ! మేలుకో !
ఓ వనితా ! మేలుకో !

# 10. ప్రగతి పథంలో

ప్రగతి పథంలో నేడు  పయనించే మహిళా !
జగతి కాంతి కాధారం  నీవేనే మగువ !
పగలురేయి పాటుపడి  గడియించవె ఘనత
సుగమంగా సుగుణంగా  సాగించవె నడత

1. అనాథవె ఆనాడు
నిరాదరణ పొందావే !
అధికారివి  యీనాడు
వ్యథల కోర్చి నిలిచావే !
చింతలన్ని వంతలన్ని
చిమ్ముకొన్న వేనాడో
చింతనిప్పులయిన కళ్లు
సిరులు చిందె యీనాడు ॥ ప్రగతి ॥

2. చదువొద్దన్నారొకరు
పదవొద్దన్నారొకరు
చదువు పదవులను సైతం
పదునుగ సాగిస్తున్నావ్
నీకై సంస్కరణలెన్నొ
నడిపారు మున్నెన్నడొ
నీకు నువ్వు ప్రగతి బాట
నిర్మించుకొమున్ముందు ॥ ప్రగతి ॥

3. ఊడిగంపు సేవనుండి  ఉద్యోగపు కాంతి దాక
ఆస్తిలేని వెలితినుండి  ఆస్తిహక్కు కలిమి దాక
విద్యలేని తనంనుండి  విదుషీమణి పదవిదాక
ఎదిరించి ఎదిగావు  రథమధిరోహించి కదులు !
ప్రగతి పథపు శిఖరాగ్రపు  కొసలు నీవు అందుకో ! ॥ ప్రగతి ॥

# 11. మహిళ

మహిళంటే మంచితనం ! మహిళంటే మల్లెతనం !
మహిళంటే మంచుతనం ! మహిళంటే మార్దవం !
మహిళంటే మానవత ! మహిళంటే మమత సమత

సహనములో శాంతములో అహమింతయు లేకతనకు
ఇహపర సౌఖ్యములొసగే ఇలవేల్పే మహిళ గదా !

ఆలనలో పాలనలో సాటియె లేదంట తనకు
పాలుగారు పసిపాపల ప్రేమతో ముంచెత్తు తల్లి !

ఒరవడిలో ఒరిపిడితో ఒడినే బడిగా జేసి
ఓనమాలు దిద్దించే ఒదుగైన గురువు గదా !

ఓరిమిలో కూరిమిలో భూమాతను తలపించే
పారిజాత పరిమళమే పతికి తాను ఔను గదా !

తల్లియు గురువుయు తానై తల్లడిల్లిన మనసును
మెల్లగ యెదజేర్చుకొనెడి ఇల్లాలే ఆమె గాదా !

తన బాధ్యత గుర్తెరిగి వ్యక్తిత్వము పెంచుకొని
తన జీవమె రమ్యము రమణీయముగా జేసుకొని
తనను తాను పోషించుక సంతానము పోషించే
స్థిరముగ తానై నిలిచిన చిరుదివ్వెయె గాదా !
దేశానికి అధినేతయె ఇందిరమ్మ కాగా (సం)
దేశానికి ఆనవాలు ఋష్యేందిర కాదా ?
ఆదేశము సందేశము అన్నియు తానై జగతిని
నడిపించే నవ్యత మరి ధీరత తానే గాదా !

# 12. లాలిత్యం - ఆడపిల్ల

లాలిత్యం నీ సొంతం ! మాలిన్యమె లేని తల్లి !
వికసిత కుసుమం నీవే విరితేనెల జల్లు నీవే !

1. వెల్లువలా ప్రవహించిన సంద్రపు కెరటం నీవే !
మల్లెల సిరివెన్నెల మకరందపు సుమగంధమవే !
తెల్లని నురుగుల పాల వెల్లువ తరగవు నీవె
చల్లగ కదలిన కదన కుతూహలగానం నీవే !

2. గృహలక్ష్మివి - కానయితే గ్రహణము పట్టినదమ్మా !
అహర్నిశలు పనిచేసినా అణాపైస లేదమ్మా !
మహలక్ష్మివి - శుభలక్ష్మివి అంటారేగానీ
ఇహచూసుకో 'ఆడపిల్ల' అనగానే కథ అంతం !

3. అమ్మవునీవు - అందరి ఆలనపాలనతోడై
అతిథి అభ్యాగతులకు అన్నపూర్ణ నీవై
పతిని గూడ నీ బిడ్డగ లాలింతువుగద(ట)మ్మా
సతిపతితో సఖ్యత చాటిననే సంసారమమ్మ

4. పదవి నేలు పడతివమ్మ - ఇది నిజమేనమ్మా !
చదువులు నీ సొంతమమ్మ ఇది కాదనకమ్మ !
పరమ పదము తెలిసికొని - పరమాత్మవుకాగదమ్మ !
పరమేశ్వరి వపుడమ్మా ! పరులకు తల్లివినీవు !

# 13. సంగీతము కాదు ఘనత

సంగీతము కాదు ఘనత
సాహిత్యము కాదు కొరత
స్త్రీస్వభావ లాలిత్యం
సన్నగిల్లితే వెలితి

1. పరువమైన పడతి ఎపుడు
లలితమైన లలన ఎపుడు
మృదులమైన మహిళ ఎపుడు
వైనమైన వనిత ఎపుడు
పరిహసించదెన్నడూ
పరుషవచన మాడదు

2 సరసమైన సంభాషణ
సరళమైన తీరుతెన్ను
ఆర్ద్రమయిన హృదయమున్న
స్త్రీ ఘనతకు ప్రాణము

**సనాతన స్త్రీ :**

విజయోస్తు మాతః శక్తిస్వరూపిణి
సృజనాత్మభావనే లోకజనరక్షణి
విద్యాపరాక్రమః పాలన సురాజ్ఞీ
మంగళమనోజ్ఞముఖి మహిళాప్రభంజనే॥

**అధునాతన స్త్రీ :**

రాజ్యాధికారిణి విజ్ఞాన వర్ధిని
పరిశోధనపరిశ్రమ రంగ శాలిని
వ్యోమగామిని దేశసౌభాగ్యదాయిని
మధుసుధాస్వరఝరీ నవనారి జయతు॥

# సంగీత సౌరభాలు

## 14. నాదావిర్భావం

ప॥ నాదావిర్భావమే పరిణతి జెందిన పరిచయమేమన
అ॥ప నాద మహతా నాహతములుగ ననంతాకాశము నావహించినది ॥

చ॥ అవనిమానవుండగ్గికి నాడిన ఆటయె ఆరని జ్యోతి నిడినటుల
ద్వివిధ మూలకమ్ముల ఘర్షణ నినదించిన నాదం బాహతము

శ్రవణ గోచరము గాకుండియు విశ్వ వ్యాపియుయోగిజ్ఞేయంబై
భవ బంధ విమోచన సాధనమై పరగు ననాది అనాహత నాదము॥ నా ॥

చ॥ యజ్ఞ యాగాది విధిక్రమమున
ఓంకార నాద ఝుంకారమై
ప్రణవమె ప్రథమ నాద సాధనగ
పరిణమించు ఆ పరిచయమేమనగా ॥ నా ॥

చ॥ ఆర్చిక గాధికసామిక స్వరముల - ప్రణవ
నిభవ ఓంకార నాదముల అగ్నిష్టోమాది కృతులతో
ఇష్టదేవతా రాధనతో పొరలిన దొరలిన స్వరగుచ్ఛములే
శ్రుతుల సోపానమై అమరిన ఆ ॥ నా ॥

సంవాదిత్వమె ఉద్దేశ్యముగా
ద్వావింశతి శ్రుతుల ప్రభవము
భరత మహాముని పర్యవేక్షణలో
పరిణతి చెందిన పరిచయమౌగను ॥ నా ॥

# 15. తంబురా

తంబుర శుభనాదంతో
అంబరానికెగసి నీవు
తుంబురు నారదులను ద
ర్శించు కోవే !

1. అంబుదమ్మై వర్షించి - కా
లాంబుద మ్మై వర్షించి
సంబరాల ఆకాశం
అంబుజముల పూయించ
హృదంబుజమున నిలువుకోవె ॥ తంబు ॥

2. మొదటిదైన పంచమమే
కదలి హృదయ తంత్రి మీట
రెండుగ షడ్జమనాదం
నిండుగ స్వాంతన మీయగ
మంద్రమే సంద్రమే - హృ
దంతరంగ మంత నిండ

పరివార శ్రుతులగూడి
స్వయంభువును దర్శించగ
మురిసిన అనాద బ్రహ్మ
కురియగ అమృతవర్షిణి ॥ తంబు ॥

# 16. సంగీత పరిణామం

వైదిక యుగమున సామగానమై
గ్రామ గానమై అనుగానమై
మార్గ సంగీత గాంధర్వమునే
పరగ జేయు భరతునికి వందనము ॥ వైదిక ॥

చ॥ మోదమొసగగా నది జనులలోని
కేదూకినది నదీ ప్రవాహమై
కాదె మతంగుని దాఘనత - ఆ
మౌని వరుని కిదె వందనము ॥ వైదిక ॥

చ॥ విస్తారాలంకార మయమయిన
ప్రస్తార జాతులు రాగములనే
నిస్తుల పరిశోధన పరిణామమె
నిలిచెను కరమున రత్నాకరమై

ప్రస్తుతము వెలయు కర్నాటక హిందూ
స్తానీ సంగీత పద్ధతులకు
శాస్త్రములకు మూలపురుషుడగుని
శ్శంక శార్ఙదేవునికి వందనము ॥ వైదిక॥

చ॥ జనక జన్య పద్ధతి జనకుడు విద్యారణ్యయతికి వందనము
విన, మాయామాళవగౌళ మహోత్తమ మన్న రామయకు వందనము
ఘన ద్విసప్తతి మేళదాత వేం కట మఖీంద్రునకు వందనము-ది
గ్వ సింధుభూత గణితమేళ ప్ర - వర్తక సాంబమూర్తికి వందనమ్మిదె ॥వైదిక॥

# 17. జగమంతా నాదమయం

జగమంతా నాదమయం
గగనమంత గాంధర్వం
సుగమంగా భగవంతు
ణ్ణిగపరచే సంగీతం !

1. మతముల జాతుల కులముల
కతీతమౌ సంగీతం!
యతులకు యోగుల కతి
సామిప్యమైన స్థిరగీతం
దిగ్దిగంతముల జల్లిన
భాండా గార మ్మిదియే
తత్త్వ జ్ఞానభారతికే
నీరాజన మిదియే !

2. పశ్చిమాన సంగీతం
పసి కన్నులు తెరువకమున్నె
పునాదిగా నిలిచిందీ
పవిత్రమౌ వేదపు మంత్రం
వినూతన విశ్వపుటంచులు తాకి పయనించిన
సనాతనపు సౌరభసుమగీతమె యీ సంగీతం !

3. సరిహద్దులు లేనిది యీ
సరిగమల స్వరఝురి
వారథిగా కలిపేది
సారథియై నడిపేది
పవనమంత అవనియంత

ప్రపంచమంతా ప్రసరిం
చిన విపంచి యౌను గదా

భాషల భావము బంధము
భూషణ రావపు గంధము
తోషణ మే యౌగా ( పరి )
యీ సామవేద పాదపము

4. భరతుని దీక్షా తపముల
ఫలమే గద సంవాదిత్వం !
నాదరూపమే భరతునిదైతే
నాదచిత్రణే మతంగ ముని దగుగా
నాదపు పరిశోదనయే రత్నాకరమైనది
నాల్గు రూపముల సామ గానము నెలకొన్నది
మేలుగన్నది రాగోచిత స్వర స్థానముగ

5. స్వరముల కలయికయే పాశ్చాత్యుల సంగీతం బహురేఖా సంగీతం
వరములైన గ్రిగేరియన్ మంత్రో చ్చారణలే
సరములైనవి సింపోనిలుగా క్రమ గతిని
స్వర సంహితలే డో, రె, మి ,ఫా, సో, లా, సీ

త్యాగయ్య, గోపన్నల
తాత్విక రసగీతాలు
బీతోవెన్ షూమనుల
స్వర సంహిత మేళాలు
సాకారపు ప్రాకారపు ప్రణవా కారములే గాదా !

# 18.సాధనయే !

సాధనయే మాధవాలయమ్మురా - నిరంతర -
బోధామృత వచనముచే
మేధా సంపదను పొంద ॥ సా ॥

చ॥ స్వరావళి పరిచయమే
ద్విత్వ స్వర స్ఫూర్తిగాగ
వరగీతాలం కారమె
వర్ణ మార్గ దర్శి గాగ !
సరస కీర్తనము సత్కృతి
సద్భక్తి ప్రదము గాగ
పరమానందద నాద
బ్రహ్మము సాక్షాత్కరింప ॥ సా ॥

# 19. తపముసేయవే !

ప॥ తపము సేయవే మనసా
తత్త్వముపై దృష్టి నిలిపి

అ॥ ప॥ విపణి వీధి బడి పోవక
వీణా నాదము గ్రోలి

చ॥ భవసాగర దుర్గంధము
లో పొరలిన ఏమి గతి !
కవనముతో గానముతో
పవలు రేయి పరితపించు

# 20. భారతిదేవి

భారతి దేవీ వందనమమ్మ సారసాక్షి మనవిని చేకొమ్మా !
హారతులమ్మా ! యివి గైకొమ్మా ! అక్షర జ్ఞానము మాకీవమ్మా !

చ॥ కటాక్షింపవమ్మా మమ్ముల నిటాలాక్షు రాణీ !
పటా పంచలౌను తిమిరము అష్ట శుభములుంటే

చ॥ గావింపుము మము ధీరులుగ
కాపాడుమమ్ము కరుణగ
పావనమౌ శుభ నామము తలచి
కావుమని వేడితిని శ్రీ లక్ష్మి !

చ॥ హృదయమున దధి చిలికి ఆనందామృతము దయచేయుమా
అదను పదును తెలిసి జీవిత కథనమును నడిపింపుమా !

చ॥ మిణుకు మిణుకను అగ్నికణమును
జ్యోతిగాను రగిలింపు మా
అణిగి మణగిన ఆత్మ శక్తిని
జాగృతమే యొనరింపుమా !

చ॥ నవవసంతమున కోయిలవై నవ
జీవనగానమునే పలికించుమ
దివిని భువిని పులకింపజేయుమా
నవ ఉషోదయమున సునాద వినోదినివై

చ॥ మాతృసేవనము మా కాదర్శము
మానవత యె మాధర్మముగా
మమత సమత అనురాగముల
మహిళా లోకము నందు మనెదమమ్మా !

# 21. సూరదాసు సూరడించి

సూరదాసు సూరడించి
కారుణ్యము జూపి నావె
చూపులుండి చూడలేని
నాపై కృప జూపవేమి ?

చ॥ మేను మరచి హా యిగాను నీలోతానైక్యమాయె
"నేను" విడిచి కేలు మోడ్చి నీవీనుల విందొనర్చె
నేను గూడ దానిలోన యే సూరవ వంతు పాడి
నీచూపులు త్రిప్పుకొనగ నేర్తున నాకన్నయ్యా ! ॥ సూ ॥

చ॥ ఎన్నిజన్మలెత్తినా - ఎన్ని పుణ్యములు చేసిన
కన్నులార నిన్ను గాంచి సన్ను తింపగలనటయ్య ?
మన్నుదిన్న పామువలె మబ్బులోని మసకవలె
నున్ననీ అన్నపూర్ణ నెన్నడు కరుణింతువొగద ! ॥ సూ ॥

# 22. చదువుల దేవత

చదువుల దేవత సరస్వతి - అ
ల్లదిగో కొలువై యున్నది

విద్యాలయమే దేవాలయముగ
వినయ సంపదయె విరులహారముగ
అనవరతము నిను - అర్చింతుము - మా
భారతి మా నుతి చేకొనవమ్మా !

సరళీస్వర ద్విత్వస్వర సమాలంకార భూషితా
వర్ణ కీర్తనాకృతి సంపూజిత సంసేవితా
నాద రూపిణీ ! ప్రణవాకారిణి ! ఓం కారిణీ !
"గాన వర్ధని" "వీణావర్ధని"గా
మమ్ముల దీవింతువుగదవే
వాణీ ! కల్యాణీ ! శర్వాణీ! గీర్వాణీ !
వీణాపాణి పుస్తక ధారిణి
వినయాంజలి గై కొనుమమ్మా !

( శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయములోని సంగీత విభాగములో సర్టిఫికెట్ కోర్సుల ప్రారంభం సందర్భంగా )

# 23. ఆది త్యాగరాజనుతుని

ఆది త్యాగ రాజ నుతుని
పాదముల భజించెద - ప్ర
మోద మలర జ్ఞాన భక్తి
వైరాగ్యము నొందెద - సు
నాదపు టంచుల హృదయాం
బుజముల పూయించెద - సు
సాధనలో సామవేద ఫలముల నార్జించెద ॥ ఆది ॥

# సద్భావనా గానం

## 24. మతం మతం

మతం మతం ఒకే మతం !
మాకది యే సమ్మతం !
కులం కులం ఒకే కులం
మనమంతా లోకులం !
మనమంతా శ్రామికులం !
మనమంతా సేవకులం

నీతినియమ సద్భావన
పాటించుటె సముచితం
ఖ్యాతి జ్ఞాన సముపార్జన
మా అందరి అభిమతం !

1. సత్య ప్రేముల సముచిత హితమే మన మతం
నిత్యానందము నిచ్చే నిర్మలత్వమే మతం
ఏక్ బ్రహ్మ ఇల్లిల్లాః మానే మానే
సర్వబ్రహ్మ అనల్హక్ జానే జానే
ఏక్ బనే ఏక్ బనే హిందుముస్లిమేకబనే ॥ మతం ॥

2. ప్రేమ సమన్వయ హృదయం
అలవరచుక సాగుదాం
కృపను సమాధానమునే
పొంది మరీ పయనిద్దాం !
ఇరుగు పొరుగు వారలనే
ప్రేమింతము మనవలెనే
కొరత లేదు ప్రభువు కరుణ
మనకు ఉండు వరకు ....ఆమెన్

మతం మతం ఒకే మతం !
మాకదియే సమ్మతం !
కులం కులం ఒకే కులం
మన మంతా లో కులం
మనమంతా శ్రామికులం !
మనమంతా సేవకులం !

## 25. అల్లదే మ్రోగింది

అల్లదే మ్రోగింది ఆపైన జేగంట !
ఉల్లమిదె పొంగింది ఎగసిపై మింట !
మల్లెలివె మొల్లలివె యీ ప్రాంగణమున
తెల్లపరచినవి యీ మతధర్మ విధిక్రమణ

1. సర్వమత సారముల సంస్కార బలమే
ఉర్వి జనులెల్లరకు ఉత్తమోత్తమము
నిర్వి రామముగాను నీ కృషిని నువు సల్పి
పర్వమును జేయుము ప్రతిక్షణము ప్రతి దినము
"కృషితో నాస్తి దుర్భిక్షమ్"

2. మతము మానవ మనుగడకు బలమిచ్చు
సతతము సంసేవనము నిత్య ఫలము
గతములో జరిగిన మారణ హోమములు
మత మౌఢ్యములు మాని మమతలను పండించు
"శ్రమయేవ జయతే"

3. జీవ కోటిని నీవు ప్రేమతో దరిచేర్చి
ఆ జీవమును గూర్చి అదుకోవయ్యా !
పావనమ్మగును నీ జన్మ సార్థకమగును
ఆముష్మికము గల్గు ధర్మనిరతున్నచో
"ధర్మో రక్షతి రక్షితః"

# 26. ఏ మతమైనా

ఏమతమైనా, ఏ కులమైనా
ఏమతి యైనా ఏ బ్రతుకైనా
నీతికి ప్రేమకు నీళ్లు వదిలితే
నిలవేయుమురా -
స్వేచ్ఛకు సమతకు సంకెళ్లయితే
వదిలే యుమురా -

1. అభ్యుదయానికి అడ్డుతగిలితే
మతము గాదది
మనిషికి మనిషికి దూరం చేస్తే
కులము కాదది
ఏడుపునకు ఆలంబనమైతే
బ్రతుకు కాదది
మూఢత్వానికి మూలము ఐతే
మనసు కాదది. ॥

2. నిత్య జీవితపు వెలుగులలోన
చక్క దిద్దు కొను జీవితము
సత్యాసత్య విషయములోన
ఉచితజ్ఞతతో వ్యవహరించుము
సమాజ శ్రేయో నిర్మాణములో
సమబాధ్యత నీదని గుర్తించు
కులమత రక్కసి నాగు కోరలు
నిలువున పీకి పేల్చి వేయరా ॥

# 27. మనిషి మనిషిలో

మనిషి మనిషిలో ఉన్న
మహనీయ చైతన్య మా !
మేల్కొనుమా ! మేల్కొనుమా !
మానవతా తేజమా ! ॥ మనిషి ॥

1. ప్రతి మనిషికి మెదడున్నా
మనసున్న వాడె మనిషి
హృదయంలో పొదిగిన ఆ
మనసు ను మేల్కొల్పుమా ॥ మనిషి ॥

2. మనసు మల్లె తనంగా
మనసు మంచి గంధంగా
మనసు మంచిముత్యంగా
మలచుట యే దివ్యంగా ॥ మనిషి ॥

3. అఖండము చైతన్యం
అవిభాజ్యం జీవితం
జీవిత చైతన్యమే
సహజమైన మానవత ॥ మనిషి ॥

# 28. కులమేటికి మతమేటికి

కులమేటికి మతమేటికి
మనలో మానవత లేని
కులమత జాతి విభేదాల్
కూలద్రోయి మానవుడా

1. భౌతిక భేదాలుకొన్ని
వీలయినవి సరిచేయి
అంతర్గత భేదాలు
ఆచారాలవ లొద్దు

2. నమ్మకాలు సూత్రాలు
సైద్ధాంతిక తత్త్వాలు
సొమ్ముచేసి బంధించే
బంగారపు సంకెళ్లు
బ్రతుకున చైతన్యంతో
ముందుకు నడువుము జీవా
నీ ధైర్యమె నీకు రక్ష
ఇది వినుమో మానవా !

# 29. మేలుకో

మానవుడా ! మేలుకో !
మానవుడా ! మేలుకో !

1. మానవుడు మట్టిలో కలసి పోయిన నాడు
దీపమ్ము గాలిలో ఊగు లాడిన నాడు
శూన్యమై ప్రకృతియె
మోడు వారిన నాడు
తెలిసి కుంటావులే ! తోడు ఎవరో !
నీ
నీడఎవరో ! ॥ మాన ॥

2. జీవితము శాశ్వతము కాదోయినరుడ !
విచ్చు కత్తుల తోటి చెల గాటమోయి !
విచ్చిన పూవుగా చేసికొని మనవోయి
విశ్వమంతయు వింత కాంతులను వెదజల్లు ॥ మాన ॥

# 30. నేషనల్ సర్వీసు స్కీమ్.

## ఎన్. ఎస్. ఎస్.

ఎన్.ఎస్.ఎస్ ! ఎన్.ఎస్.ఎస్ !
నేషన్ సర్వీస్ స్కీమ్ !
జాతీయ సేవా పథకం ! మాది
జాతి సమైక్యతా ధ్యేయం

1. శ్రమ శక్తిని మేధా సంపత్తిని
సమపాళ్లలో సాధించుటె మా పని
క్రమ శిక్షణ - శ్రమ గౌరవం !
"శ్రమ యేవ జయతే" మా నినాదము ॥

2. చెప్పి చేయుట - ఇది మావంతు
చేసింది చెప్పుట మావంతు !
సత్ప్రవర్తన సమ సమైక్యత
సౌభ్రాత్రము ఉండు మా చెంత ॥

3. సంఘీభావము స్వేచ్ఛాజీవము
సహకారము మా కృషిలో భాగము
కులమత భేదము కూడదు మాలో
కల్పిత వ్యత్యాసములే చూడము ॥

# 31. సారా ఉద్యమం

మానరా నీమత్తు
మరచిపోదువు పొత్తు
కరకు గుండెను కాస్త
కరగనీ ఇసుమంత ॥ మా ॥

1. అమ్మ ఆప్యాయంగ నిన్ను పెంచింది
ఆలి అనురాగంతో నిన్నుపెనవేసింది
అలుపంత తీరేను నలుసు నీదరికొస్తే
తెలివి తప్పినీవు తెగతాగి తెగడొద్దు ॥ మా ॥

2. నీ ఆలు బిడ్డలకు నిలవనీడలేక
అల్లాడు తుంటేను ఆనందమా నీకు !
నీ ఆయువును సగము మింగిన ఆ కల్లు
కంకాళముగ జేయు, వింతయేమున్నదిర ॥ మా ॥

3. ఎండిఎండి ఎడద మండిపోయిన నీవు
గెండెంత గుల్లయ్యి గుబులు రేగిన నీవు
పండంటి బిడ్డ పరుగెత్తి నీ దరికొచ్చి
మెండైన మమతతో మెడను గట్టిగ జుడితే
ఎండమావిగ నీవు నిండు ప్రేమా లేక
పుండు రేగినయట్లు పులిసి వాగేవుర ॥ మా ॥

# 32. ఉపాధ్యాయులం !

ఉపాధ్యాయులం మేమంతా !
అపార జ్ఞానార్జన మావంతు !

1. సర్వమతాల సారమొక్కటని
సమరస భావం జాతిసొంతమని
సర్వే జనాః సుఖినోభవంతు !
సందేశం మా మనసంతా ! ॥ ఉపా ॥

2. జ్ఞాన సంపదయె భాండాగారమై
ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వమై
మేధా సంపద మూర్తి గాంచిన
రాధా కృష్ణన్ వారసులం !
రాతికి చలనం కలిగిస్తాం ! ॥ ఉపా ॥

**(డా ॥ సర్వేపల్లి రాధాకృష్ణ పుట్టిన రోజున)**

# 33. చంద్రునిలా !

చంద్రునిలా ముఖబింబం !
అద్దంలా హృద్బింబం !
నిరంతరం స్మరించెదం !
వరించెదం ! చరించెదం!

1. మంచి మాట మరుగంధం !
మంచి చేత మారుతం !
మాటల్లో పని పాటల్లో
మనసుంటే మకరందం ! ॥ చం ॥

2. ఎంచుకోనిదే మంచి మాట
ఏక్షణానికా క్షణమది క్రొత్త !
సహజ స్పందన ఫలమే సత్క్రియ
సాగునదే జీవితపు బాటగా ॥చం ॥

3. రోజాలాగ తాజాగా
తాజ్‌మహల్లా మోజుగా
జీవితమే ఉత్తేజంగా
రోజూ రోజూ జరగంగా ॥ చం ॥

# 34. చినికి చినికి గాలివాన

చినికి చినికి గాలివాన
చేసికుంట వెందుకే !
ఉనికి మనికి తెలిసి నీవు
వివరంగా బ్రతకవే !

కొండలాంటి అండవుండ
ఎందుకంట గుండెతంట !
మాటవినని మాయమనసు
నిండ పురుగు తొలచునంట

ముందునీవు నింపాదిగ
సందు చూసుకొని సాగవె
తెలిసిన పని ముందు చేస్తే
తెలియని దదె తెలుస్తుంది

# 35. సర్వమత పూజ్యబాబా

సర్వమత పూజ్యబాబా !
సకల జనా రాధ్య బాబా !

1. మనుషులందరొకటని
మనిషి విలువ ధనము కాదని
మనిషి కలిమి ప్రేమయేనని
మనిషిని కొలిచిన ప్రేమధునీ !

2. మనిషి కొరకు మతమని
మతము కొఱకు మనిషి గాదని
మతముల సారము ఒక్కటని
మతములేక పరచిన మౌనీ !

3. మానవతయె నీమతం !
మమతల మందార యుతం !
మహిమాన్విత నీతిపథం !
మహాద్భుతం నీ చరితం !

# 36. సాయి చెప్పిన దాని సారాంశం !

సాయి చెప్పిన దాని సారాంశమేమి ?
శాయ శక్తుల జీవితము దిద్దుకోమని !

1. శాస్త్రాధ్యయనము చాలదా ఏమి ?
చర్వితి చర్వణ స్తోత్రములేల ?
పరిప్రశ్నతో పరమార్థము తెలిసికో !
తెలిపినదానిని బ్రతుకులో మలచుకో !

2. చూడవయ్యా ! చెలిమితో దీనజనుని
కూడదయ్యా ! వాని కసరుట విసరుట
కూడుగుడ్డ నీడ అందరికి ఒకటే !
పాడు భేదాలు రానీయకు మనసున !

3. ప్రేమ అంటే ఏమిటో అసలు తెలుసా !
తన - మన - నేను లేకుండుటే మనసా !
వ్యర్థ మౌను బ్రతుకు ఆర్ద్రతే లేకున్న
షిర్డి నాధుని జీవితము బోధరోరన్న !

# పర్యావరణ పదాలు

## 37.ఇంటా బయటా

ఇంటా బయటా ఇంట్లో బాగా
వుంటే ఆరోగ్యం
తంటా లేవీ మనసునకంటక
వుంటే సౌభాగ్యం

1. చిందర వందర గందర గోళం
చేయకు ఇల్లంతా
అందేటట్లు వస్తువులమర్చి
అందంగా దిద్దు గదంతా ॥ ఇంటా ॥

2. ఇంట్లో ఊడ్చే కసువు బూజు వా
కిట్లో వెయ్యొద్దు
ఇల్లు నీదయితే వీధి అందరిది
ఇబ్బందులు ఎవరికి చెయ్యొద్దు ॥ ఇంటా ॥

3. మురికి శరీరం మురికి బట్టలు
దురలవాట్లు దోషాహారం
తిరుగుళ్లూ తినుబండారాలు
దేహం చెరిచే దుష్ట పరివారం

చీకూ చింతా భీతి పంతం
లేకుంటేనే జీవిత సౌఖ్యం
చదువు సంధ్య ఒంటికి మనసుకు
సరిపడితేనే జీవిత గమ్యం ॥ ఇంటా ॥

# 38. కాలుష్యం !

కాలుష్యం ! ఇది కాలుష్యం !

1. చుట్టు ప్రక్కల కాలుష్యం !
చెరువులు బావులు కాలుష్యం !
ఆకాశంలో కాలుష్యం !
ఆలోచనలో కాలుష్యం !

2. పంట చేలలో కాలుష్యం !
వంట నూనెలో కాలుష్యం !
బజారు సరుకులో కాలుష్యం !
బ్రతికే బ్రతుకులో కాలుష్యం !

3. పేడా పెంటా పడేయకటు నిటు
భూమి లోపల పాతరపెట్టు
త్రాగే నీటిలో గేదెలు కడుగకు
పొగ పీల్చకు దగ్గరలో వదలకు
రణ గొణ ధ్వనులు మైకులు పెంచొద్దు
కణ కణమండే ప్రతీ కారాలు చెయ్యొద్దు

4. కాలుష్యం పోవాలంటే
ప్రకృతి హితంగా వుండాలి !
కాలుష్యం పోవాలంటే
సమాజం బాధ్యత పెరగాలి !
కాలుష్యం పోవాలంటే
ప్రభుత్వం బాధ్యత పూనాలి
కాలుష్యం పోవాలంటే
వ్యక్తి జ్ఞానమే పెరగాలి !

# 39. ఒక్క చెట్టు నాటితే !

ఒక్క చెట్టు నాటితే
ఊరంతటికీ పెట్టు !
ఒక్కచెట్టు నరికితే
వినాశానికీ మెట్టు !
ప్రేమించుట నేర్చుకో ప్రకృతిని
ప్రేరేపించకు ఎన్నడు వికృతిని ॥ ఒక్క ॥

1. నీ దేహపు మలినాన్ని
నీళ్ళు కడిగి పెట్టు
నీ శ్వాసను శుభ్ర పరచు
పచ్చనైన చెట్టు
నీ మనసున మాలిన్యం
ఏది తుడిచి పెట్టు ?
నీది - నాదను భావం -
అహం కట్టి పెట్టు ! ॥ ఒక్క ॥

2. పచ్చని చెట్టు - క్రింద - చల్లని నీడ
ప్రక్క - చక్కని కొలను - మందమారుతం !
ప్రకృతంత విశాలంగ మనసుమలచుకో !
పరిసరాలతో కలసి బ్రతుకు పంచుకో ! ॥ ఒక్క ॥

# 40. మొక్కలమ్మ మొక్కలు

మొక్కలమ్మా మొక్కలు
అవ్విమనకు అక్కలు
జంతువులమ్మా జంతువులు
అవ్వి మనకు బంధువులు ।
చక్కగా మనకిచ్చును
పండుకాయ పాలుపెరుగు॥

1 చక్కగా మన పెరటినాటి
పెంచిపోషణ చేసికొందము
చక్కని కొట్టాలలోన
చల్లగా కాపాడుకొందము॥

2 నీలి మబ్బుల పిలచుకొచ్చి
నింగినేల ఒకటి చేయును
ఏమిటమ్మాఅవి ఏమిటే?
మొక్కలమ్మా మొక్కలు
అవ్విమనకు అక్కలు
పాలనురుగుల మనసునిచ్చి
మానవత్వపు విలువపెంచును
ఏమిటమ్మా అవి ఏమిటే?
జంతువులమ్మా జంతువులు
అవ్వి మనకు బంధువులు

3. బొగ్గు గాలి తాము మెసవి
ప్రాణవాయువు మనకు నిచ్చునే
ఏమిటమ్మా అవి ఏమిటే?
మొక్కలమ్మా మొక్కలు
అవ్వి మనకు అక్కలు
తగ్గమాంసకృత్తులిచ్చు
తాముగా మన తనువుపెంచును
ఏమిటమ్మా అవి ఏమిటే?
జంతువులమ్మా జంతువులు
అవ్వి మనకు బంధువులు॥

# ప్రకృతి పులకింతలు

## 41. పావురాయి

తెల్లతెల్లని పావురాయి
కల్ల లెరుగని పావురాయి
తెలుపులోని తలపు లేవొ
తెలుపుమా !
వలపులోని పిలుపులేవో
తెలుపుమా !

1. ఆశతోడనె ఆకసాన
ఎగిరిపోయేవు
నల్లనల్లని మేఘమాలతొ
పొందుకోరేవు
నీలిమబ్బులో నీడ చూసి పొంగి పోయేవు
మబ్బు నిన్నుమాయ జేసి విచ్చి పోయేనే !

2. హాయి హాయిగ గాలిలోన
వాలిపోయేవు
తీయతీయని కలలలోనే
తేలిపోయేవు
చెట్టుమీద పిట్టలన్ని
పొంచిచూసేనే !
గూటిలోనె గుట్టుగానే
కుదుట పడవె పావురాయి

# 42. వెన్నెల

వెన్నెల ఊహలలో మల్లెల
కొల్లల మాధురిలో
అందమె అలలై పొంగులై
ఆనందమె పన్నీటి జల్లులై

1. చందమామ నీ అందము జూచి
కలువల డెందము ఊగెరా !
నీరాక కోసమె దారులు కాచి
కలువల కన్నియ కలవరించెరా ! ॥ వె ॥

2. కొమ్మమీది కోయిలమ్మ
'కూ' యనే ' కుహూ' యనే
మదిలోపలి మధుర వీణ
ఓయనె - ఒహో యనె
హృదయంలో ఆనందం వెల్లివిరిసెనే
మదియంతా మయూరమై నాట్యమాడెనే ॥ వె ॥

3. దూర తీరాలకు సాగిపోవు
ఓ నీలిమేఘుమా !
మదిలోపలి మధురగీతి
నెలరాజుకు తెలుపుమా !

చిగురాకుల రుచిమరిగిన
ఓస్వారి చిలకమ్మా!
నీజిలిబిలి పలుకుల నా
హృదయరీతి తెలుపుమా ॥ వె ॥

# 43. కోయిల

కోయిల కమ్మగా పాటపాడెనెందుకో
ఈ వసంతమే ఒకటై గళము విప్పి పాడెలే !

చిగురాకుల ఊయలలో చిలుక పలికెనెందుకో !
పగిలిన గుండియ చిగురులు తొడిగిపల్ల వించెనే !

నీలిమేఘమే కరిగి నింగిపొంగెనెందుకో
పాలనురుగుల మనసే పరవశించెనందుకే !

పూలలోని పుప్పొడి తుమ్మెదయె గ్రోలెనెందుకో
మేళవించిన మనసున మధువు నిండినందుకే

అడవిలోని నెమలి ఆడి అలసి సొలసెనెందుకో
పుడమిని పాలించు ప్రభువు దరికి చేరినందుకే

# 44. మల్లెలు !

మల్లెలు మల్లెలు !
తెల్లని మల్లెలు !
కల్లలు ఎరుగని
కన్నెల కులుకులు !

అసలు మల్లెలూ - పరిమళమిచ్చి
కొసగంటును తెలవారకముందే - కాని యీమల్లెలో -
పగలూ రేయీ పలుసేవలలో
నిగనిగ మెరయును
నెనరులు కురియును -

ధవళ వస్త్రాల సేవానిరతుల
కువకువలాడే కపోతముల్లా
సహనం శాంతం సౌశీల్యంతో
నైటింగేలును తలపించే
నర్సులు - నర్సులు
నారీమణులు !

## 45. చిలుకనై

చిలుకనై పోయానె
చిన్నారి చెలియా !
చిగురుటాకులలోన
ఊగి పోయానే !

ఆకుపచ్చనితోట - ఆటలాడానె
ఆకసానమబ్బు - అందుకొన్నానె
పచ్చన్ని చేలపై పరుగులెత్తానే
పరవశించి నేను - పాట పాడానే !

2. మాల్లె మనసే నాది
మర్మమెరుగదు - కదే !
మరుల డోలిక లోన
తేలిపోయానే
మనసంత మందార
పూలునింపానే
నా చెలుని రాకకై
వేచియున్నానే !

# 46. పొద్దు పొడవకముందె

పొద్దు పొడవకముందె - కోడి కూసింది
సద్దు సేయక నేను చెవి యొగ్గివింటి
శంకరాభరణమని తోచింది ఎదకు
శంకరుడె దిగివచ్చి శుభములే పలుకు ▪

మల్లె తనమున మనసునుంచుకోమంది
మమత కన్నా అధిక మింకేమిలేదంది
మనసు మార్దవమె మాలికలు నుమ్మంది
పెనవేసుకోనిపోయి మనుము నీ వంది ▪

# 47. తరికిటతక ఝం

తరికిటతక ఝం - నాట్యం చేసింది - అది
పరమ శివుని స్మృతి పథమున నిలిపిందీ

వెండికొండపై నిండుపున్నమిని
తలదాల్చిన ఆ పరమశివం

మృదంగ జతులను పలికింది
డమరుక యతినే తలపించింది !

ఏమిటది - అనలేమిటది ?
ఏమిటది - ఇంకేమిటది ?

మలమలమాడుతు మలుపులు తిరుగుతు
తలుపును త్రోసిన కాలభైరవం !
తలను పంకించి చెవులు ఝుళిపించి
కిటకిట యని చెవి నూపింది - ఆ
నాదమె నా చెవిసోకింది - ఆ
రాధనగా మది పులకించింది

# 48. తేలియాడినదేమి ?

తేలియాడిన దేమి నాహృదయము - మే
లిమి తామరల దొంతరను చీల్చు పరిమళము
చాలా సుకుమారమే యీతనువు సొంపు
నీలోత్పలము చేసి సోలిపోయినదే ॥ తేలి ॥

చ॥ మరచి పోతిని లోకము - దరిచేరి
పరవశించితి ఏకమై
విరుల బాణము వేసిన - ఆమరుని
మెరపు చూపుల చిక్కితి ॥తేలి ॥

చ॥ చిలుక పలుకుల కులుకుల
కలకల రవముచే నొప్పకేదార
గలగలల సెలయేటి ఝురులలోన
అలకాంతునికి వలపు మాలలే వేసి ॥ తేలి ॥

# 49. జామురేతిరి

ప॥ జాము రేతిరి కాడ
"మామూలు" గానక

మోము చిన్నబోయి
వాపోయి నేనుండ

రావేమి రమణీయరంగనాసామి
ఈ వేమి నీకరము ఇంపు మీరంగ ॥ జాము ॥

చ॥ తనివార నీఒడిలో
తన్మయత్వము జెంది
పున్నమి రాత్రుల కెదురు తెన్నులు జూచి
ఎన్ని జన్మలకైనా మన్నింతు వనుచును
పన్నుగ మదినమ్మె అన్నపూర్ణను జేర

రావేమి మధురాధరాల నా సామి !
రావేమి రమణీయరంగ నాసామి ! ॥ జాము ॥

# ఆరోగ్య గేయాలు

## 50. మృదులం ! మధురం !

మృదులం ! మధురం ! మనోహరం!
మది పదిలం గృహ విద్యా జ్ఞానం !
జీవన యానం ! జీవిత గానం !
జ్ఞాన ప్రమాణం ! గృహ విజ్ఞానం !

1. గృహనిర్మాణం ! గృహనిర్వహణం !
గృహ ఆరోగ్యం! గృహాలంకరణం !
గృహిణిగ మెలిగే గుణములు గరిపే
గురుతర శిక్షణ గృహశాస్త్రం !

2. పోషకాహారం ! పిల్లల వికాసం !
పరవశ మొసగే పూల అమరికలు
వస్త్ర నియోగం - వస్తు వినిమయం
ప్రజ్ఞాపాటవ ప్రకటన - దర్శనం !

3. ప్రీతికరం ప్రేమోత్సాహకరం
ప్రసన్నతా దరహాస పూరకం
ప్రతి హృదయానికి పరిమళమిచ్చే
గృహవిజ్ఞానశాస్త్ర సుమగుచ్ఛం !

(HOME SCIENCE)

# 51. ఆరోగ్యమే మహాభాగ్యం

ఆరోగ్యమే మహాభాగ్యము
ఆనందమే అను భోగ్యము !

1. కనుపెంచెడి కాయమ్ములో
కనుపించని మనసున్నది
అనునిత్యము ఆరోగ్యము
కనిపెట్టి కాపాడుకో ! ॥ ఆ ॥

2. బ్రతుక తినువాడు - బలవంతుడు - గుణవంతుడు
తిన బ్రతికే వాడు - తిష్టవేస్తాడు - మందమతుడు
పోషించు(ము) దేహాన్ని - శుష్కింపగజేయకు
పౌష్టిక ఆహారము - పరమౌషధము నమ్ము ॥ ఆ ॥

3. చక్కని చిత్తాన్ని కష్ట పెట్టకు నీవు
చీకు చింత చావు లెక్క బెట్టకు నీవు
చెమటోడ్చు వానికి భ్రాంతి లేనే లేదు
చిరునవ్వు మోములో - చింత కననీయకు ॥ ఆ ॥

4. చదువు - సచ్ఛీలమును సంతరించుకోముందు
సంపద - సమదృష్టి చేర్చుకో నీముందు
సాంఘిక దృష్టితో మౌఢ్యమును ఛేదించు
సర్వులకు ఆరోగ్యమానంద దాయకం ॥ ఆ ॥

# 52. చందమామ చూడు

చందమామ చూడు - జాబిల్లి చూడు
కొండెక్కి చూడు - మబ్బులోకి చూడు

1. దూరాన బంతిలా తారాడు చున్నాడు
తారాపథమ్మున రేరాజు వాడు
సూర్యరశ్మి సోకి చంద్రకాంతులీను
శుక్ల కృష్ణ పక్షముల వెలుగునీడ లిచ్చులే ॥ చంద ॥

2. సూర్య కుటుంబమున చంద్రగోళమొక్కటి
మర్యాదగా చుట్టు తిరుగాడు చుండు
సూర్య చంద్ర శుక్ర శని రాహు కేతువాదులు
తొమ్మిది గ్రహమ్ములు జడమ్ములని తెలుసుకో ॥ చంద ॥

3. అన్నయ్య లెందరో అంతరిక్షచారులై
తిన్నగాను మామ కొఱకు ఎన్నోసార్లో వెళ్లిరి
ఆంస్ట్రాంగ్ ఆల్డ్రిన్ కాలిన్స్ ముందు వెళ్లి వచ్చారు
చిన్నితల్లి నీవు గూడ ఎగిరి వెళ్లిరావాలి మామ నందుకోవాలి॥ చంద ॥

# 53. పిల్లల మనసులు

చల్లని తెల్లని పిల్లల మనసులు
మల్లెలు గా వికసించాలి
కల్లాకపటం ఎల్లలు దాటి
తల్లి దండ్రులే చూడాలి !

1. చీటికి మాటికి చిదక బాదటం
"అధికారపు" దుర్ల క్షణము
విద్వేషం వ్యతిరేకం పెరుగు
ఆదరణ, అనురాగం తరుగు

2. అయిన దానికీ కానిదానికీ
ఆగం చేయుట సరికాదు
సముచిత మేమొ అనుచిత మేమొ
సవరించినుడువ "స్నేహస్వామ్యం"

3. గారాబంగ గోముగా నుండి
నేరాలను సహియించడం
అన్నింటికి అనుమతి నివ్వడము
చిన్న పిల్లలను చెడిపే విధము

4. అనుక్షణము గమనించి అందరం
అనురాగం కురిపించాలి
అనవరతం సూచించాలి
ఆలోచన నేర్పించాలి
స్వచ్ఛందంగా, స్వచ్ఛంగా
స్వేచ్ఛగ మెలిగే - కలిమిని ఒసగే
"అవకాశం" కల్పించాలి.

# 54. ఎ, బి, సి, డి విటమిన్లం

ప్రశ్న : ఎవరండ్రా మీరలు ?
సమా: ఎ బి సి డి విటమిన్లం !

ప్రశ్న : ఎందుకొచ్చారు మీరలు
సమా : ఆదు కుంటాము వీరులం ॥ ఎవ ॥

'ఎ' విటమిన్ నన్నంటారు
ఆకు కూరలో వుంటాను
కన్నుల వెలుగులు చిందిస్తాను
మిలమిల తళతళ కలిగిస్తాను ॥ ఎవ ॥

'బి' విటమిన్ నన్నంటారు
పప్పు ధాన్యంలో ఉంటాను
బలదారుఢ్యం ఇస్తాను
బలవంతులనే చేస్తాను ॥ ఎవ ॥

'సి' విటమిన్ నన్నంటారు
సిట్రస్ ఫ్రూటులో ఉంటాను
జీవాన్ని నేనిస్తాను
మిసమిస లాడి స్తుంటాను ॥ ఎవ ॥

'డి' విటమిన్ నన్నంటారు
సూర్యకాంతి చేపల్లో వుంటా
ఎముకలకు బలమిస్తాను
దంతాలను పోషిస్తాను ॥ ఎవ ॥

ప్రశ్న : డాక్టర్లా మీరందరూ
ఎక్కడవుంటారిందరు ?

సమా : యాక్టర్లం మేమందరం-మీ
కడుపులోడాన్సు చేస్తాము ॥

# 55. తినండి ! తినండి !

తినండి ! తినండి !
బాగా తినండి !
తినితిని నవనవ లాడండి
తినితిని కళ కళ లాడండి
పోషకాహారమూ తిని - సం
తోషముతో కృషి సల్పండీ !

1. పాలు పెరుగు కోడి గుడ్లు మరియు
పప్పు ధాన్యములు వాడండీ !
మాంస కృత్తులు బాగా గ్రహించి
పుష్టి - సౌష్ఠవం పొందండి. ॥ తినండి ॥

2. నిమ్మనీరు తేనె తీపి కలిపి
నిత్యము పొద్దున తాగండి
నారికేళ నారింజ ఫలాదులు
జరజర జవ సత్వములిచ్చు ॥ తినండి ॥

3. ఆవు రావురన ఆకు కూరతిను
అట్లాగే ఉడికించిన కూరలు
అన్నము కన్నా కూరలు మిన్న
అన్ని వేళలా నీరు సేవించు ॥ తినండి ॥

# 56. చిట్టి పాపలు

చిట్టి పాపలం - చిలుక పలుకుల
చిరునవ్వుల వదనార విందముల
చింతలేని మా స్వాంతనమ్ముల
చెలిమికి తృప్తికి సంకేతాలం !

1. కళలు జనుల జీవితాలకు వెలుగు
వెలుగు ద్వార అభ్యుదయం కలుగు
కళా జీవితము మానవత్వమని
చెలువు మీర చాటి చెప్పు చుంటిమి ! ॥

2. స్వేచ్ఛాయుత చైతన్య గీతికలు
సోదర భావ సమంచిత కవితలు
సమతా తరంగ నృత్య నాటికలు
వినిపింతుము, చూపింతుము ఇంపుగ ॥

3. బాల్వాడీ బిడ్డలము సొంతము
కేలు మోడ్చి వందనమర్పింతుము
కలముతో హలముతో జీవిస్తాము
శ్రేయము సిరులు కురిపిస్తాము ॥

(స్వాగత గీతం)

# 57. రంగుల వైభవం !

రంగు రంగుల వైభవం !
రాగోదయపు ప్రాభవం !
రంగురంగుల హరివిల్లు !
బంగరు పొంగుల మన ఇల్లు !

1. ఏడురంగుల ఇంద్రధనుస్సు
ఏడుగుర్రాల రథతేజస్సు
వైలెట్ ఊదా నీలము పచ్చ
పసుపు నారింజ ఎరుపు రంగులు !

2. కనిపించే యీ రంగులనేకం
కవ్వించే కమనీయ ప్రకాశం !
రంగులపురి సింగారపు రీతులు
రంగ వల్లుల వేల నిరతులు

3. చంద్రుడు తెలుపు - చంద్రిక తెలుపు
సంద్రపు నీటి నురగలు తెలుపు
కలువలు తెలుపు - కాంతులు తెలుపు
చలువ రాతి తాజ్ మహల్ తెలుపు
పాలు పెరుగు పంచదార తెలుపు
పాల రాయి పాదరసం తెలుపు
మంచు తెలుపు మంచి మనసు తెలుపు
మించిన స్నేహపు ముచ్చట తెలుపు

మల్లెలు తెలుపు - మాలతి తెలుపు
ఉల్లి లిల్లి జిల్లేడులు తెలుపు
వరిఅన్నము కరిదంతము తెలుపు
చిరుపాపల దర హాసము తెలుపు
సాత్విక గుణ సంకేతము తెలుపు
సత్ప్రవర్తన చిహ్నామె తెలుపు
జాతి పతాకము మధ్యన తెలుపు
నీతి నిజాయితి తత్త్వము తెలుపు

4. రక్తము ఎరుపు రోజా ఎరుపు
రగిలే అగ్ని కణాలే ఎరుపు
కుంకుమ ఎరుపు పంకజ మెరుపు
కమల దానిమ్మ క్యారెట్లెరుపు
తామర బంతి టొమాటో మిర్చి
తూరుపు సుందర సూర్యుడు ఎరుపు
రజోగుణానికి గుర్తే ఎరుపు
తేజము క్షాత్రమపాయము ఎరుపు
త్యాగానికి కాషాయపు టెరుపు
రాగానికి రమణీయపు టెరుపు
జెండాపై కాషాయము ఎరుపు
చూడగ ఢిల్లీ కోటయె ఎరుపు
జన్మనియంత్రణ చిహ్నము ఎరుపు
తాంబూలము సేవించిన ఎరుపు.

5. చెట్లు చేమలు పంటలు పచ్చన
చైత్రం వసంత ఋతువులు పచ్చన
పాడి, పంట సంపద పచ్చన
జెండా దిగువన కమ్మని పచ్చన
యువతీ యువకుల మనసే పచ్చన
వృద్ధి చెందు సంసారము పచ్చన
ప్రేమ, పెండ్లి, పరువము పచ్చన
వెమలి, వెచ్చెలి తలపులు పచ్చన
ఆకులు కూరలు ఎన్నో పచ్చన
శుకములు పికముల కువకువ పచ్చన

పసుపుకొమ్ము బంగారము పసుపు
మొగిలి మొట్ట తామరలే పసుపు
ప్రొద్దు తిరుగుడు పూలే పసుపు
బీర కాకరల విరులే పసుపు
దోసకాయ బత్తాయిలు పసుపు
ధండిగ పండిన నిమ్మలు పసుపు

7. పృధ్వి నలుపు రేచీకటి నలుపు
పుట్టిన పాపల జుట్టే నలుపు
మినుములు ఇనుములు కనుమలు నలుపు
కనుపాపలలో గుడ్లే నలుపు
ఎలిమి తామస గుణమ్ములు నలుపు
ఎలుగులు పాములు ఏనుగు నలుపు
కంటికి పూసిన కాటుక నలుపు
మింటికి అమరిన రాతిరి నలుపు

8. శంకు డిసెంబరు పూలు నీలము
గగనము మేఘము సంద్రము నీలము
కాపర్ సల్ఫేట్ నేరెడు నీలము
మయూర కంఠము రంగు నీలము

కనుపించే యీ సృష్టి సర్వము
కమనీయ మైన రంగుల నేస్తం !
కడివెడు గుమ్మడి కత్తికి లోకువ !
కోటి రంగులూ కుంచెకు లోకువ !

# 58. బొమ్మల కొలువు

బొమ్మల కొలువు
కమ్మని కొలువు
రంగురంగుల హంగుల కొలువు

పిల్లల మన్నన పొందిన కొలువు
పెద్దలు మదిలో మెచ్చిన కొలువు

కళలు కాంతుల కన్నుల పండువ
కలిమి బలిమి కూర్చే కొలువు

మేలిమి ఓరిమి కూరిమి కలిగి
ప్రీతి మదిని కలిగించే కొలువు

దేవతల దేవేంద్రుని కొలువు
దేవుని కొలిచే భక్తుల కొలువు

రాజు వెడలిన మంత్రుల కొలువు
రాష్ట్రపతికి ప్రజలిచ్చిన కొలువు

# 59. ఎయిడ్సు

బంగారం సింగారం
నీలోగిలి చేసికో
అంగాంగం ఇల్లాలికి
అతి పదిలం చేసికో

కంగారులు పడవద్దు
ఖంగాళీ చేయొద్దు
సింగారం సిరులన్నీ
శ్రీమతికే అనుకోరా

చూస్తున్నాం గదరా
చాలమంది అన్నలు
చూస్తున్నాం గదవే
చాలామంది అక్కలు
ఉసురు బోసికుంటున్నా
రీ మహమ్మారి ముందు నేడు

వద్దుర బాబోయ్ ! వద్దుర బాబోయ్ !
హద్దులోన ఉంటేనే అందం బాబోయ్ ॥

ఆలికన్న ఎక్కువా
అవతలి ఆడది నీకు ?
మాలిమినీ దాన్ని ఏలు
అదే నీకు ఆస్తి అంత !

చాలును పైపై రుచులు
మరిగినదీ చాలురా
పాలుమాలి మరినీవు
ఏజోలికి పోవద్దుర

వద్దుర బాబోయ్ ! వద్దుర బాబోయ్
హద్దులోన ఉంటేనే అందం బాబోయ్ ॥

నీ ఒళ్లంతా గుల్ల
అయిపోతది చెల్లెలా
నీ కల్లోలం జూడగ
ఎవరుందురె చెల్లెలా
నీ ఒంట్లో నెత్తురంత
నీరై పోతాదిమరి
నీ ఒళ్లు నీ బరువు
తరిగి తరిగి కరిగిపోవు

క్షీణదశకు వస్తే నిను
చూసేదెవరే చెల్లెల
నీ భాగ్యం పుండవుతే
నీ బావకు గుండెదిగులు
నీ బిడ్డలు చింపిన చిరిగిన
ఇస్తర్ల వుతారె
ఈ ఎయిడ్సు జబ్బునీవు
ఈది లోకి రానీయకె

వద్దుర బాబోయ్ ! వద్దుర బాబోయ్
హద్దులోన ఉంటేనే అందం బాబోయ్

నీ బిడ్డకు పెళ్లిగాదు - ఇది సంఘపు దోషము
నీ ఆలికి అన్యాయము - ఇది నేరపు నైజము
నీకు నీవే దోషివి - కాసైనా మిగల దింక
ఇది ఆర్థిక దోషమన్న - అన్నింటిని తెలియుమన్న

సుబ్బరంగ ఇల్లు ఒళ్లు
నిబ్బరంగ కాపురం
ఒబ్బిడిగా ఇద్దరుంటె
లేనిది యిక ఏమిటంట ?
ఒద్దిక ఒబ్బిడి ఒకటిగ
గూటిలోన నవ్వుతుంటె
మధ్యన పిల్లలు చేరితె
మందిర మే సుందరమే
సుందర మే మందిరమే

# వృద్ధులపై పాటలు

## 60. ఆనందోత్సవం

ఆనందోత్సవం - అంత
ర్జాతీయోత్సవం
అనుభవాలతో ఎంతో ఎదిగిన
పెద్దల - వృద్ధుల ప్రధానోత్సవం ॥ఆనం ॥

1. వృద్ధుల బాధ్యత - బాధల నెంచి
వృద్ధుల ఆశయ - సేవల గ్రహించి
ఐక్య రజ్యసమితి - పెద్దల
అవసరాలను గుర్తించి
అన్నిదేశాలలో సంబరం
అక్టోబరు ఫస్టని చాటింది. ॥ ఆనం ॥

2. భావి ప్రజాళికి కారకులైరి
భావితరాలకు బాటవేసిరి
ఉపకారులకు ప్రత్యుపకారం
ఉత్సహించి చేతము రారండి ॥ ఆనం ॥

3. పిన్నలు - యువతులు - పెద్దలు - వృద్ధులు
వర్గ విభజనతో పనిలేక
స్త్రీ పురుష వ్యత్యాసం లేక
కలిసి మెలసి పండగ చేదాం
పరస్పరం ప్రేమించుకొందాం ॥ ఆనం ॥

# 61. ఎగరేయండి

ఎగరేయండి ! ఎగరేయండీ !
గగన వీమకు మన జెండా !
అగణిత సేవలు చూపించే
విగ విగ లాడే వృద్ధులజెండ ॥ ఎగ ॥

1. జరా భారము తేలిపోవగా
మరణ భీతిని మాపు చేయగా
కరుణ ప్రేమల సంకేతం
పరోపకారవు శాంతి నికేతం ! ॥ ఎగ ॥

2. ఏజి కాదు మన
ఇమేజి చూపే
తాజా గ ప్రతి
రోజూ గడప
"హెల్పేజి" సేవల ప్రతీకము
ఋజువర్తనపు కీర్తి పతాకం ॥ ఎగ ॥

# 62. వృద్ధులకు వందనం !

వృద్ధులకు వందనం
పెద్దలకు వందనం
వృద్ధజన సేవా ప్ర
సిద్ధులకు వందనం

ప్రేమ, ముద్దు మాట,
కూర్మి, గోరు ముద్ద, ౧
మనమ్ము, ధనమ్ము బిడ్డలకు
పణముగా పెట్టి ॥ వృద్ధు ॥

శక్తి తరిగినా - ఆ
సక్తి కేమి కొదవ ? ౨
యుక్తులుడిగినా జీవనా
రక్తికేమి కొఱత ?

మా ప్రేమే మీకు శక్తి ౩
మా సేవే మీకు రక్తి
పూజింతుము సేవింతుము

దీర్ఘాయువు కల్గుదాక
జీవించుడి జీవించుడి
జీవన పథాన సజావుగ ॥ వృద్ధు ॥

# 63. పెంచిన పెద్దలు

పెంచి పోషించినవారికి
పూల హారాలు వేయాలి !
పెద్ద చేసిన వృద్ధులకు
పట్టెడన్నము పెట్టాలి ! ||

1 దేహధనాదుల వెచ్చించి
శ్రమలకోర్చి చెమటోడ్చి
ఇంతటి వారల జేశారు - మీ
కెంతో ఋణ పడియున్నాము ||

2. సంతతితో బంధాలు పెంచుకొని
పరిసరాలతో పెనవేసుకొని
కాళ్ళు కదపలేకున్నారు
కనిపెట్టి గౌరవించాలి ||

3. పని విలువను రూకలతో కొలువక
పని లేకుంటే పనికి రారనక
వృద్ధుల యెడ మనసుంచాలి
పెద్దలను పూజించాలి ||

# సందర్భోచిత సృజనలు

## 64. సులలితం

సులలితమైనవి లతాకుంజములు
మృదులమైనవి సుగుణవీచికలు

కోమల మైనవి సుమదళాంజలులు
పరిమళమైనవి పారిజాతములు

లలితమూ - మృదులమూ
కోమలమూ మా
'ఫిలోమినా' బేబి

సుమధురమూ సురుచిరమూ
సోయగము ఆమె
చిరునవ్వుల శోభ !

(ప్రొఫెసర్ పి. ఆర్. రెడ్డి గారు పుట్టిన రోజు. 27 ఏప్రిల్)

# 65. జయమ్ముగల్గు గావుతన్

జయమ్ము గల్గు గావుతన్
రయమ్మున ఏతెంచుమా
ప్రియమ్ముగా నయమ్ముగా
ప్రసిద్ధిగ అరుదెంచుమా !

1. ప్రకృతంత విశాలముగ
బ్రతుకు సాగనిమ్మని
సుకృతమ్ము జేసికొనగ
జీవమునే నడుపుమని
సుహృత్ భావపు రెల్లుల
సౌరభమ్ములిమ్మని
చాటింపుము దేశవిదేశములయందు నీవు ॥

2. దరహాసముతో తిరిగి
దరిజేరగ జూతుమమ్మ
చెరగని కీర్తియుయశస్సు
కొని రాగా జూతుమమ్మ

దారికాచి మరీ మీ కు
స్వాగతమును పలికెదము
హృత్పూర్వక వీడ్కోలు
చేకొని పయనింపుమమ్మ ॥

(వి.సి. మేడమ్, ప్రొఫెసర్, డా ॥ ఫిలోమినా రాయపరెడ్డి గారు విదేశాలకు వెళ్లిన సందర్భంగా )

# 66. హృదయా వేదన

హృదయాలు చెదిరాయి
వదనాలు వెలిసాయి
గత స్మృతులు తలపు కొచ్చాయి
వెత జెంది వీడ్కోలు నిచ్చాయి.

1. లలిత లలితమ్ము మీ
గృహ శాస్త్ర జ్ఞానమ్ము
మధురాతి మధురమ్ము
మీ ప్రేమ వాక్యమ్ము
ఎన్నెన్నొ మెలకువలు నేర్పారు
మన్నించి వినయాలు తెలిపారు

2. దేహాలు దేహాలు దూరాలు కావచ్చు
దహి యించి దహియించి అంతమైపోవచ్చు
మీ మనసు మా మనసు ఒకటైనవి
మమతలు సమతలు అలలైనవి

3. మరువ లేకున్నాము మీ మాతృహృదయమ్ము
మురిపించు చిరునవ్వు మై మరపు స్నేహమ్ము
మీ రూపమే మాకు ప్రేమామృతం
మా హృదయమే మీకు నీరాజనం !

(శ్రీ మ్యాత్యూ మేడమ్ శాశ్వతంగా వెళ్లి పోయినపుడు - ఏప్రిల్ 92 )

# 67. వేణుగాన రసధురీణుడు

వేణుగాన రసధురీణు
డీ "ప్రపంచ" వీరుడు
మాణిక్యము వాని గుణము
మార్దవమే వాని మనము

1. వెదురు పొదలలో దాగిన
సొదలు వాని సొంతమంట
మృదు మధుర నినాదమే
మదియంతట నిండునంట ॥

2. దేహము గేహము మరచి, గాన
మోహపు కడలిని తేలి - వ్యా
మోహపు తెరలను తెంచి - సు
మోహన కృష్ణుని జూపే ॥

3. నిజముగ నాతని నైజము
అజరుద్రాదుల సైతము
అచ్చెరు వొందగ జేయును
సచ్చరితుని జేయునతిని ॥

నిచ్చలును పవిత్ర భక్తి
ఉచ్చరింప గాన రక్తి
పచ్చగ వర్ధిలజేయును
పదిపదులు దాటు దాక ॥

(ప్రొ॥ ప్రపంచం సీతారామ్ గారిపై)

# 68. కరుణశ్రీ

కరుణశ్రీ పోయారు
అవును వెళ్లి పోయారు
పూదండ వా(డి)పోయింది
ఒట్టి దారమే మిగిలింది.

ఆదారం ఒట్టిదా ? కాదు
కరుణా సౌరభాలతో
ఏరాజిల్లే దారమది
అరుణార్క కోటి
ప్రభాకాంతులతో
వెలుగొందే దారమది

ధరణిపై కవితా వారుణిని ప్రవహింప జేసేదారమది
భవిష్యత్ కవి కుమార - కవయిత్రుల కల్పనా కౌశలానికి
ఆధారమది - కేదారమది.

('కరుణశ్రీ' అస్తమయం విని)

# 69. వరములనీయవె (గీర్వాణి)

వరముల నీయవే వాణీ - గీర్వాణీ !
శరమున బిరమున కరుణను జూడవే

1. తిరుమలేశుని దివ్యసన్నిధిని
తిరముగవెలసిన వరవిద్యాలయం
వనితల మనసుల వికాసానికై
వేంచేసిన, వాణీ, 'కులపతి' గ ॥ వర ॥

2. కన్నుల కాంతులు కలయ బోయగ
అన్నుల మిన్నల వృద్ధి చాటగ
తిన్నగ మిన్నగ తమసులు తొలగ
పన్నుగ జ్ఞాన సంపన్నులజేయగ ॥ వర ॥

3. "జ్ఞానమ్ నిర్మోచనం స్త్రీణా"
మను సంధానపు విద్యలు నడుప
ముదమారగ మీసేవలు పండ
పద్మావతి శుభ ఆశీస్సు లిడు ॥ వర ॥

(ప్రొ.॥ పి. గీర్వాణిగారు వి.సి.మేడమ్‌గా వచ్చినపుడు)

# 70. న్యాయ దేవత

న్యాయ దేవతా వందనము
విజ్ఞాన దేవతా వందనము

1. ధర్మనిష్ఠతో కూడిన బుద్ధుని
ధర్మ చక్ర ప్రవర్తనము
సత్యనిష్ఠతో నిండిన గాంధి
నిత్య జాతీయ జీవనము

సంఘ పునాదిగ సమతాదర్శం
సంఘ జీవముగ సౌభ్రాతృత్వం
సంఘ వికాసము - శీలము - సమత
సకల జనులకు సమకూర్చేటి ॥

2. నీతి నియమములె నీకు హారముగ
సత్యధర్మములె నీకు హారతిగ
ప్రేమ వర్తనమె నీరాజనముగ
నిర్మల హృదయమె సమర్పణముగ ॥

# 71. నిత్య సత్యవతి

నిత్య నిర్మల ధవళ కాంతిలో
ముత్యమేగద సత్యవతినువు
పున్నెముల పంటవుగ మాకిల
లభ్యమైతివె యశము పండగ

1. సమయపాలన - నియమ పాలన
అమలమౌ కనుదోయి కాగా
వినయము మూర్తీ భవించిన
అనయము ఆచరణ కల్గిన

2. విద్యలకు విజయములు తోడుగ
పద్మావతి విశ్వ జనని ఒడిలో
మేటి పదవుల దీటుగా, తుల
తూగి, ఘనతను పొందినావె

3. ప్రతిభ మించిన కార్యశూరత
ప్రథమ ఆచార్యతలో దక్షత
ప్రభల వెలిగిన కిరణ పుంజం
ప్రభువు నీకిడె ప్రజల సేవకు

(ప్రొ॥ ఎ. సత్యవతి గారి ప్రన్సిపాల్ పదవీ విరమణ సందర్భమున)

# 72. పారిశ్రామిక రంగాన

పారిశ్రామిక రంగాన
ప్రభంజనంలా మెరిసేటి
ఔత్సాహిక మహిళామణులార
అభినందనలు మీకృషికి ॥

1. విద్యాదేవి సరస్వతి
ధన ప్రదాయిని శ్రీలక్ష్మి
శక్తి నిధానం మహేశ్వరి
సమస్త సౌభాగ్యం స్త్రీదే ॥

2. పాండిత్యంలో పరిశోధనలో
పరిశ్రమలలో పరిపాలనలో
ప్రజాసేవలో విజ్ఞానంలో
ప్రతిభావంతులు నేతలు మీరే ॥

3. పలుక్షేత్రాలలో పురుషుల సాటిగ
పోటీగా దీటైన ప్రమదలు
ప్రేమ జూపుటలో మాతృమూర్తులు
సేవ జేయుటలో సిద్ధహస్తులు ॥

4. వినూత్న జీవిత పంథాలన్నిట
వీరోచితముగ ప్రతిభలు చూపిరి
మహిళా విశ్వ విద్యాలయము
ముదమారగ మీకాలంబనమౌ ॥

(జాతీయమహిళా పారిశ్రామిక వేత్తల మహాసభలో : 28-6-97)

# "జన్మభూమి" ప్రబోధాలు

## 73. తరలిరండి, తరలిరండి

తరలిరండి, తరలి రండి - జన్మభూమికి
కరము కరము పట్టి పనికి కర్మభూమికి

1. ఒకరి కొకరు పదిమంది - పదిమందికి ప్రతిఒక్కరు
పరస్పరం సహకరించి పనిపాటలో కలిసిమెలిసి
భారతదేశపు ప్రగతి ప్రతిగ్రామాన జూడ
ఊరూరా ఉద్యమించి పురోగతికి పాటుపడ ॥

2. అజ్ఞానం ఒక వంక - అనారోగ్యమొకవంక
అమాయకపు జనావళిని ఆవహించియున్నది
విద్యా జ్ఞానమునిచ్చి విజ్ఞానం అందించి
వికాసము కల్గిద్దాం విముక్తికై కృషిచేద్దాం ॥

3. స్వయం శిక్షణ
స్వయం రక్షణ
స్వయం పోషణ
స్వీయావగాహన
సమకూర్చగ శ్రమచేద్దాం
సర్కారుకు తోడ్పడుదాం ॥

4. వర్గ వర్ణ భేదముడిపి
అగ్ర అంత్య భేదమడచి
సమభావం సహవాసం
సౌభ్రాత్రం సాధిద్దాం ॥

5. ప్రతిబిడ్డకు మందూ - మాకూ
ప్రతి యువతకు బ్రతుకూ - తెరువూ
ప్రతి మనిషికి కూడూ - గూడూ
ప్రతి పల్లెకు ప్రగతీ - సుగతీ
ప్రతి కుటుంబ సంక్షేమం
పరిసరాల పరిరక్షణ
ప్రభుత్వము కల్పించగ
ప్రజలు పూనినెరవేర్చగ ॥

6. ఇదే - జన్మభూమికి
ఋణం తీర్చడానికి
మనదీక్ష మన ప్రతిజ్ఞ
మన విజ్ఞత కృతజ్ఞత ॥

# 74. జన్మభూమి

జన్మభూమి
కర్మ భూమి
పుణ్య భూమి
మనదేశం !
మనగ్రామం దేశంలో
మాన్యమైన భాగం
గ్రామ సేవయే - మన
దేశ సేవకాదా ! ॥

1. కన్నతల్లి - నేలతల్లి
మనకు జీవనాధారం
తల్లిని పూజించు
నేలను సేవించు

తల్లి ఋణం తీరేది
త్యాగంతో నేరా
ఒళ్లువంచి పనిచేసి
ఋణం తీర్చుకోరా!

2. సమాజము శుష్కించి
వ్యక్తిని పోషిస్తోంది
శక్తిని, నీ శ్రమనిచ్చి
సమాజాన్ని పోషించు

భోగానుభవం కన్న
త్యాగానుభవం మిన్న
వెళుతూ నీవొక్క పైస
వెంట బెట్టు కొనిపోవు ||

3. బుద్ధితోడ పూజించు
పనులతోడ సేవించు
కర్మ ఫలం సంఘానికి
ప్రేమ ఫలం నీకూ

సమాజమే దేవాలయం
జనచైతన్యమె దేవత
సకల జనుల హితకామన
సర్వేశ్వర ఆరాధన ||

# 75. రండీ రండీ

రండీ రండీ మన
గ్రామసభామండలికి
పిన్నలు పెద్దలు రండీ
వనితలు పురుషులు రండీ
మహిళామండలి సభ్యులు రండీ
కార్యకర్తలూ రా రండీ ॥

గ్రామసమస్యలు చర్చిద్దాం
గ్రామోన్నతిని సూచిద్దాం
చేతనైన పని మనం చేసుకొని
ప్రభుత్వసాయం కోరెదము ॥

ఆవీధుల్లో చెత్త చెదారం
ఆ సందుల్లో ముళ్లు - మురుగు
ఎటు చూసిన దుర్గంధవాసనలు
మటు మాం చేద్దాం రండీ ॥

'జన్మభూమి' మనకొరకై వచ్చెను
పనిపాటల సూచనలే ఇచ్చెను
శ్రద్ధాసక్తితొ విద్యజతజేసి
శ్రమను తెలివితో కలిపిఫలిద్దాం ॥

# 76. శ్రమ దానం

శ్రమదానం చేతామా ! మి
శ్రమముగ మన మేకమై - స
మిష్ఠిగ కృషి చేతామా
అంతరములు మరచి మరీ

1. భేద భావమే లేదిట
పదవుల మాటసలు లేదు
పారలు పలుగులు పట్టి
వారధి నే నిర్మింద్దాము
అహరహము శ్రమియించి
భారతినే సేవిద్దాము
కారణ జన్ములమౌదాము
ఇలలో మహిళలమంతా
భువిలో పురుషులమంతా [illegible]

2. జీవము పోతామూ మన
సాత్త్విక శక్తుల్ప తెరువుతూ
విద్యా దానము సాటిగ తూగ
శ్రమదానము చేసిన ఫలము
వినయాంజలి కృతకమౌ లాంజలి
ఘటియిత్తము మాతృదేవికి [illegible] ॥

3. మన యింటిని మనమేగద - పరిశుభ్రము చేసికొనుట
మన వీధిని మనమేగద - మలినములను త్రోసికొనుట
మన రాష్ట్రపు నిర్మాణము - మనమేగద చేసికొనుట
మన దేశపు ప్రగతికి తగు - మార్గము నియమించు కొనుట ॥

# 77. జన్మభూమి కోసం

జన్మభూమి కోసం - జనులందరు ఏకమై
ఒకరికొకరు పదిమంది - పదిమంది ఒక్కరై
అవగాహన పెంచుకొని
అలసి సొలసి పనిచేద్దాం
ఉపాధ్యాయులుద్యోగులు ఉత్సహించి రారండీ
యువకులార కదలిరండి - యువతులార కలసిరండి ॥

1. పదిమందికి వలసినపని - పదిమంది కలసిచేయ
ప్రతినబూని శ్రమచేయుట - పరమార్థం, ప్రగతి విధం
గ్రామసీమ వికాసం - జన్మభూమి ఉద్దేశం
ప్రేరణ జేయుట మనపని - ప్రజానిర్వహణ కోసం ॥

2. రోడ్డు వేయటేకాదు - తవ్విన రోడ్డు పూడ్చడం
కాల్వతవ్వుటేకాదు - నీళ్లువృథాకాకుండటం
ఇళ్లు కట్టుటేకాదు - కులాలను కలిపేయడం
ప్రజాపనులకర్థమిది - ప్రజాస్వామ్యభావమిది ॥

3. బాధ్యతెరిగి పనిచేయుట - భావమెరిగి మసలుట
శ్రమసద్వినియోగమౌట - శ్రమనుదోచుకోకుండుట
అక్షరజ్ఞానస్థులు, గ్రా - మస్థులతో కలిసివుంట
'నవ' సమాజసృజనమ్ - 'సమ' సమాజమార్గమిది ॥

4. ఒక్కరి 'పొగ' పదిమందికి - హానికరం కాకుంట
తాగుబోతు, కుటుంబాన్ని - తొక్కి అణచకుంట
పెట్టుబడులుజనావళికి - కాలుష్యం పెంచకుంట
చైతన్యం, విజ్ఞానం - సమపాళ్లలోపెంపొందగ ॥

# 78. మా దేశం

మా దేశం ఆంధ్ర ప్రదేశము
భరతావని ముద్దుబిడ్డ
బంగరు దేశము మా దేశం
ఈ దేశం ॥

1. గోదావరి కృష్ణవేణి పెన్నారు తుంగభద్ర
ఆంధ్రులకాంధ్రేతరులకు జీవనాధారాలు
అటుకాటన్ ఆనకట్ట - ఇటు ప్రకాశం బ్యారేజి
అదెమా పోచంపాడు - నాగార్జునసాగరమ్మో
నవభారత ఆలయము ॥

2. జలవిద్యుత్ కేంద్రాలకు నిలయములు మానదులు
సీలేరులు, శ్రీశైలము, మాచ్‌ఖండ్ ప్రాజెక్టులు
వెలయించును విద్యుత్ సౌధాల క్రాంతిప్రసరములుగ
సౌందర్యం సౌభాగ్యం శాంతికి వినియోగముగ ॥

3. సాంకేతిక నిపుణులకు సమరస నవరసకళలకు
సమసమాజ నిర్మాణపు సాంఘిక సంస్కర్తలకు
శౌర్యధైర్య సమన్వితలు స్త్రీలకు శుభశీలురకు
కాణాచి మాదేశం కరువులేని ఈదేశం ॥

# స్వర్ణోత్సవ గీతాలు

## 79. స్వర్ణోత్సవ రథం

కదిలింది, కదిలింది స్వర్ణోత్సవ రథం
కాశ్మీరం కొలువునుంచి కన్యాకుమారి వరకు ।
ప్రజల కొఱకు ప్రజల చేత
ప్రజాక్షేమ పాలనలో
యాబదేండ్ల కృషి ఫలితం
ఎఱ్ఱకోటప్రగతి రథం ॥

1. రథికుడు రాజేంద్రప్రసాద్
రథసారధి జవహర్లాల్
రథనిర్మాణపు శిల్పి
రాజ్యాంగపుటంబేద్కర్
అశరీరుడు గాంధీజీ
ఆశీస్సుల నందుకొని ॥

2. ప్రాణాలర్పించి నట్టి
భగత్‌సింగు సుబాసులు
మన్యంలో తిరగబడ్డ
అల్లూరి సీతారామ్
జాతి సాహస నికేతన్
ఝాన్సీ లక్ష్మీ బాయి
జనులమేలు కొల్పినట్టి
సుబ్రహ్మణ్య భారతియార్
వందలు వేలుగ గుండెలు
గుండ్లకు అర్పించినట్టి
భారత స్వాతంత్ర్య సమర
వీరుల రక్తపు శక్తితో ॥

3. రథికులుగా కొనసాగిన
రాధాకృష్ణన్, హుస్సేన్, గిరి

ఫక్రుద్దీన్, సంజీవరెడ్డి
జైల్‌సింగ్, వెంకట్రామన్
వెలుగులలో వెలుగొందిన
శంకర్‌దయాల్ శర్మ కాగ
నరులకు మణికిరీటముగ
నారాయణుడధిష్టించ

4. సారధులు విశారదులు
లాల్‌బహదూర్ ఇందిరలు
దేశాయ్, వి.పి. సింగ్‌లు
నంద - చౌదరి - చంద్రలు
నాటిగౌడ నేటి గుజ్రాల్
మహామహులు బాటవేయ
ప్రజాభీష్ట ప్రతీకగ

## 80. ఎఱ్ఱకోటపై జెండా

ఎగిరింది ఎగిరింది
ఎఱ్ఱకోటపై జెండా
ఏటేట యేబదేండ్లు
ఎగసిన సొగసైన జెండా

1. తెల్లదొరల జులుమును
మెల్లగ తొలిగించాము
నల్లదొరల విలువను
పెల్లుబుకగ జేశాము
బానిస సంకెళ్ల నుండి
స్వచ్ఛమైన ఇచ్ఛవైపు
సామ్యవాద గణతంత్ర
సర్వతంత్ర స్వతంత్రంగ

2. పంచవర్ష ప్రణాళికల
ప్రగతి-పరిమళము సోక
సామ్యవాద సిద్ధాంతపు

సమత సౌరభము చింద
విద్య - ఉపాధి - వృత్తి
విజ్ఞానపు తేజమబ్బ
సకల జనుల సహకారపు
సహృదయ స్పందనతో ॥

3. రాజకీయ చైతన్యం
రగిలించిన జెండా
ప్రజాస్వామ్య పాలనలో
పేరొందిన జెండా
పౌరులు జీవించు హక్కు
పరి రక్షించిన జెండా
ప్రపంచ పటమున శాంతి
ప్రతిష్ఠించిన జెండా ।
ఎగిరింది ఎగిరింది
స్వాతంత్ర్యపు జెండా
మువ్వన్నె జెండా
భరత భూమి పండ
స్వర్ణోత్సవ జెండా - సు
వర్ణ శోభ నిండ ॥

# 81. ఆనందం

ఆనందము తాండవించె
అనురాగం వర్షించె
భారత స్వాతంత్ర్య ప్రగతి
స్వర్ణోత్సవ ప్రాంగణమున ॥

1. విద్యుత్ తోరణ కాంతులు
వికాసాని కానవాలు
పచ్చపచ్చ పరగణాలు
పంటల కొలమానాలు
భూరి ప్రయాణపుదారులు

భారిపరిశ్రమ గురుతులు
స్పందనపల్స్ పోలియోలు
ప్రజారోగ్య చిహ్నాలు
ప్రతి ఇంటాక్షర కాంతులు
విద్యా వ్యాప్తి విభూతులు
పలురంగాలభివృద్ధులు
ప్రగతికి బంగరు బాటలు

2. మహిళాస్వేచ్ఛకురక్షణ
బడుగుప్రజాసముద్ధరణ
దీనజనుల సంతరణ
దళితులకు పరిపాలన
అంగహీనులపై కరుణ
అస్పృశ్యత నివారణ
శతసంక్షేమ విధులు
సాగగ సమకూర్చెనిధులు

3. అంతరిక్షయానంలో
కంప్యూటర్ జ్ఞానంలో
అంతరంగ భద్రతలో
అతులిత సైనికశక్తిలో
అంతర్జాతీయ స్థాయిలో
ఎంతో ఎత్తుకుఎదిగేనో
యాబదేండ్ల పాలనలో
స్వాతంత్ర్యపు భరతావని

4. మానవుడాసించేది
మనఃశాంతి దేహసుఖం
మనకది లభ్యంఅయితే
మనప్రగతి సార్థకం
ప్రాంగణపు చిరునవ్వులు
ప్రపంచాన వ్యాపిస్తే
స్వర్ణోత్సవ గీతికలు
స్వర్గసౌఖ్యదీపికలౌ

భారిపరిశ్రమ గురుతులు
స్పందనపల్స్ పోలియోలు
ప్రజారోగ్య చిహ్నాలు
ప్రతి ఇంటాక్షర కాంతులు
విద్యా వ్యాప్తి విభూతులు
పలురంగాలభివృద్ధులు
ప్రగతికి బంగరు బాటలు

2. మహిళాస్వేచ్ఛకురక్షణ
బడుగుప్రజాసముద్ధరణ
దీనజనుల సంతరణ
దళితులకు పరిపాలన
అంగహీనులపై కరుణ
అస్పృశ్యత నివారణ
శతసంక్షేమ విధులు
సాగగ సమకూర్చెనిధులు

3. అంతరిక్షయానంలో
కంప్యూటర్ జ్ఞానంలో
అంతరంగ భద్రతలో
అతులిత సైనికశక్తిలో
అంతర్జాతీయ స్థాయిలో
ఎంతో ఎత్తుకుఎదిగేనో
యాబదేండ్ల పాలనలో
స్వాతంత్ర్యపు భరతావని

4. మానవుడాసించేది
మనఃశాంతి దేహసుఖం
మనకది లభ్యంఅయితే
మనప్రగతి సార్థకం
ప్రాంగణపు చిరునవ్వులు
ప్రపంచాన వ్యాపిస్తే
స్వర్ణోత్సవ గీతికలు
స్వర్గసౌఖ్యదీపికలౌ